సకలవేదపురాణశాస్త్రములకలిమి, వేయినోళ్లనుగొనియాడువిపులమహిమ
సత్యనిత్యసదాచారసద్గుణములు, వెలయుచుందురు రప్పురి విప్రవరులు.

సీ. జలజాతసూతి నై మెలఁగుచుండియుఁ దాను జలజాసనత్వంబు సమ్మతించె
నను మనసారగా       గని మోహగతి నింటిగరితఁ జేసె
దోషాకరత్వంబుఁ దొలఁగకుండఁగఁ జేసి ద్విజచక్రముల భీతిఁ బెరయఁ జేసె
జలన మొందఁగనీక సతతంబుఁ దలవాకిటను నన్ను నిలువఁ గట్టడియుచేసె
ననుచువిధినిందగావించియుచటువాసి,పలుకుచిలుకలకొలికియింపొలుకఁదమదు
చెలువునెమ్మోముదమ్ములఁజేరినిలువఁ, బెంపుగాంతురు పృథ్వీనిలింపు లచట.

క. చతురాననచతురానన, నతతాధిగతాధికప్రశస్తసువిద్యల్
చతురైకనిజముఖంబున, నతులస్థితి నలవరింతు రచ్చటవిప్రుల్.

గీ. అప్పురంబులోన నలరారు నొకభూమి, దేవునేని గన్నఁ దెలివికాని
నఖిలదర్శ       నాగమకర్తృసం, దర్శనానుభూతి దప్పకుండు.

ఉ. ఆనతశత్రువాహిను లహర్పతితేజులు సంగరక్రియా
నూనమహాప్రతాపులు మనోభవరూపవిలాసవిగ్రహు
ల్దానగుణాభిరాములు సదా మతిమంతులు ధీరు లుత్తమ
జ్ఞానులు సత్యవాదు లవిషణ్ణులు తత్పురిరాకుమారకుల్.

సీ. పసులకాఁపరితోడ బలుపొందు గైకొన్న యొకసరుచేతుల మోపి కెంత
విషమదృష్టులయొద్ద విలువిద్యగైకొన్న పరశురాముని బాహుబలమ దెంత
కుశలవవిజయంబు గొన బల్మిచాలక వేనుకద్రొక్కినరాము వీర్యమెంత
నిలువుగన్నులు వడి యిల నిల్వలేనిసేనల నేలు గుహుబల్మికలిమి యెంత
యనుచు నెటువంటి వీరుని నౌర యనుచు
మెచ్చుకొనుమాటఁ బూనరు మచ్చరిలిన
హార్యవార్యసమాధుర్యశౌర్యు లగుచు
సూర్యసోమాన్వయులు రాజవర్యు లచట.

ఉ. మానిత*హాలికోక్తియును మానలవృత్తియు గోపకత్వముం
బూనినవార లప్పురికి ముఖ్యులు గావునఁ దారు సల్లసన్
న్మానితహాలికప్రకటమానలగోపకవృత్తిసంపదల్
గానను బొంది వైశ్యులు వికాసత నుందురు రప్పురంబునన్.

---

* హాలికోక్తి - మూలము.

చ. అరయఁగఁ గామితం బొకటి యైనను గానక యావికత్థ యైఁ
బరఁగెడు నాదిభిక్షుకుని బంధువు సేఁదఁడు గాన లుబ్ధతా
పరు నలకాపతిం గుమతిభావముఁ జెందను మమ్ము నందదం
చురుతరవర్ధితాఖిలజనోదయు లౌదురు వైశ్యు లప్పురిన్.

సీ. నగరాజునైనఁ బన్నగరాజునైనను ధైర్యవాక్పటిమలం దఱుమఁగలరు
రుద్రుని నైన సముద్రుని నైనను శౌర్యగాంభీర్యాప్తిఁ జరుపఁగలరు
ఇంద్రుతో నైన నుపేంద్రుతో నైనను భోగభాగ్యస్ఫూర్తిఁ బోరఁగలరు
అజునితో నైనఁ జిత్తజునితో నైనను నిర్మాణరూపము ల్నెఱపఁగలరు
ఘనులు నిర్వక్రవిక్రమక్రమమదారి, చక్రదళనక్రియావక్రజయపరాక్ర
మక్రియాముద్రనిర్నిద్రమద్రయశులు, శూద్రు లప్పురిఁ గలరు విశుద్ధమతులు.

ఉ. ఏఱులమిన్న నయ్యమున నేరున భేదన మాచరించెఁ దా
నేరున దున్ని భూమి ఫలియింపఁగఁ జేయఁగ సీరపాణియు
న్నేరఁ డటంచుఁ గేళికొని నేర్పలరం గృషిచేసి ధాన్యము
ల్మేరకు మించఁగా ధర ఫలింప నొనర్తురు శూద్రు లప్పురిన్.

క. బ్రహ్మపదజనన మొనరుచు, బ్రహ్మనిరూపకపురాణపరత మెలఁగుచున్
బ్రహ్మోరాద్గతి నెడసియు, బ్రహ్మోరాద్గతి ఘటిల్లఁ బరఁగిరి శూద్రుల్.

క. మాతోఁ బుట్టిన గంగయు, ఖ్యాతిన్ జనములకు ముక్తి గలిగించెను మా
చేతనె భుక్తియుఁ గలదని, ప్రీతిం జెలఁగుదురు దప్పురింగల శూద్రుల్.

మ. సిరి విద్యుల్లత చంచలత్వ ముడిగెం జెన్నారె నేవేళలం
గర మింద్రోపలనీలకాంతులు నిజాకారంబునన్ మా(కునీ)
కరణిం గావలె నంచుఁ గృష్ణఘనముం గాంక్షించి సేవించు న
బ్బురపుంగారుఘనంబులో యనఁగ నొప్పు న్వీట మత్తేభముల్.

చ. జగములు రెంట విష్ణుపదసంగతి గాంచె నిజాధినాథుతో
గగనమువాఁక యవ్విధము గాంచకపోవుట గాదటంచు వే
గగనధునీజలంబు కరకాండములం గొని తెచ్చి నించి ప
ద్దెగలగు నేఱులన్ జలనిధిం గనఁజేసె గజంబు లప్పురిన్.

చ. సురధుని నోలలాడుసురశోభనగాత్రులయూరుసౌష్ఠవం
బరుదుగఁ జూచి లజ్జపడి యాత్మకఠోరకరంబు లెల్ల ని
ర్భరముకుళాకృతు ల్గొనఁ దరం బగునే గ్రహియింపఁ దత్పురీ
కరులకు నట్లు గాని యెడఁ గైకొనవే యవి నీర మంతయున్.

ఉ. వాచకశబ్దము ల్పరనిపాతముచే విలసిల్లు వాచ్యతా
రోచిలు మాకుఁ దాదృశత రుచ్యముగా కితరార్థరీతిగా
నౌచితి గా దటంచు మది నారసిరో పరపాతనక్రియ
ల్మోచి వసించు నప్పురి నమోఘబలాన్వితము ల్కరీంద్రముల్.
శా. పీటం బాటిలు ఘోటకావళుల యుద్భిన్నాంఘ్రివేగంబుతో
సాటిం జెందఁగ వచ్చి వాయుమనము ల్సత్త్వంబులే కయ్యెడ
న్నీటు ల్వోవఁగఁ దత్పదాహతరజోనీకంబుచే నుల్లుఁ జే
ద్పాటుం జెందె నవేసుమీ భ్రమరజఃప్రాబల్యము ల్వానికిన్.
క. ఏకకచక్రవుఁజక్రిన, నేకత గాంచియు వహింప నేరక వుడమిన్
జోకటి పడు నని నగు నగు, లోకాప్తునిహారుల ఫేనరుచుల హయంబుల్.
చ. సురుచిరరాజకన్యకల సోఁకుట నిత్యము రూపభావముం
బొరయుట జన్మసంశ్రయతఁ బూనుట నిక్కముగాఁ బిశాచమై
పరఁగెడుగాడ్పు వేగమునఁ బొల్పడునే సరిగాఁగ మాకు నం
చుపగతివేగసంపదల నొప్పు నదుష్టములై పురిన్ హరుల్.
క. అరయఁగ నెప్పుడుసత్త్వము, భరియింపనుమనసు లక్ష్యపదమాయను వే
సరి యెట్టు లౌ నటంచు, న్నరు లప్పురి మెలఁగుచుండు నతిసత్త్వమునన్.
సీ. క్లిష్టకల్పన లేక కష్టతాదూరమై యసమర్థత నెఱుంగ కప్రతీత
తను మాని యప్రయుక్తతను రోసి పత్ప్రకర్షనైరర్థక్యఘటన గనక
దృఢపదబంధసంధిస్ఫీతమై సుప్రసాదకాంత్యౌజ్జ్వల్యసమత లలర
వస్త్వలంకృత్యభివ్యక్తులు పొసఁగంగఁ జిత్రవిన్యాసంబు చెలువు గనఁగ
నతులకవిరాజరచితకావ్యములనంగఁ, జెన్నుమైవాటిచూపిక చ్పేరువుమీఱుఁ
బుష్యరథము లసంఖ్యము ల్వొలుపు మిగులుఁ
బురవతంసము ద్వారకాపురములోన.
క. అచలత నవరత్నరుచి, ప్రచురత చిత్రప్రకారబహుసురపురస
ద్రచనతఁ బురిలో నరదము, లచలాధీశ్వరులమాడ్కి నలరుం జాలన్.
సీ. వెలఁది నీకైదండవెల యెంత తెల్పవే యలరునాకైదండవెల సులభమె
చనుబంతు లీరెండుఁ గొనవేడ్క చెలువరో చనుబంతులీరెండుగొనఁగలేవు
ఆకాశసుమ మిదెం తభ్రమే కననీయ వాకాశసుమదృష్టి యభ్రమెకద
పలునొక్కులకుఁ బొలుపడెఁగదే చిగురిద్ది పలునొక్కు లిడఁగ నీపాటివారె

వింతతావులు గనంగ నువ్విళ్లు మాకు, వింతతావులు గనంగ నీ వెంతవాఁడ
వనుచువిటులకుఁదమకునయ్యాటమమర, విక్రయింతురుపుష్పలావికలువిరులు
సీ. వలపులీనంగ సోఁగుఁ జెలువ నీకై దండవెల చెప్పరాద టే వలయుమాకు
వనిత పుంస్కోకిలాస్వాదితం బీనన రుచి చూడనీఁగదే రుచిరగాత్రి
పోలంతి మాటఁగ నేల పొన్నపు వ్విదిమాకుఁ జెన్నారు వన్నె చేమిన్నుముట్టె
వలువలో డాఁచెదు వలుదపూబంతులు పుట్టినయవిగానఁ బుట్టె మనసు
అనుచు నాగరవిటులు నర్మానుబంధ, బంధురంబుగఁ బల్కెడుపల్కులాని
గోముమీఱిన నవ్వులమోముు లలర, నమ్ముదురు పువ్వులవ్వీటనలరుఁబోండ్లు
ఉ. పోయినవారిఁ దేవసమె పుత్తడిబొజ్జకునైన మాదు చూ
చాయ్పల చాయనే చనిన చక్కెరవిల్తుని చాయ నెన్నికం
బాయ్యఁగఁజేయు లక్షణకుఁ బొల్పడు మాయబలాశ్రీపదం బనం
జాయు విటాళి లోఁగొనుచుఁ జక్కని వేశ్యలు పొల్తు రప్పురిన్.
చ. సతతగిరీశభావమున సమ్మతశుద్ధకళావదాఖ్యసం
గతశివమూర్తియైన నధికస్ఫురదక్షికటాక్షవీక్షణాం
చితగతిమాత్రనే రతివిశిష్టపరంపర లీను నిక్కవం
బతిశివమూర్తు లంచు విరులందఁగ వేశ్యలు పొల్తురప్పురిన్.
సీ. చందనాలయమహాచలరాజరాజత్సుగంధచందనగంధకలన మీఱి
నానామహీరుహానూనననవ్యామోదసుమగుచ్ఛపరిమళస్ఫూర్తిఁ దనరి
రసరమ్యపద్మినీ*రాగసంగమపరిప్రాప్తంబు మధుసేవఁ బరిఢవిల్లి
సకలవధూటికాసముదయాశ్రయకామసంతతాధారతాసరణి నలరి
మెలఁగుచుండెడు మేనును మేను నెడమ, నతులభీతినిబలేమందగతులుసాగియు
నప్పురంబునఁజరియించు నహరహంబుఁ, బట్టుగైకొనిమృదుమరుద్బ్రహ్మచారి
సీ. శక్తిత్రయజ్ఞానసంపత్తి నలరారి పంచాంగనిర్ణయప్రౌఢి మెఱసి
†యావాప్యతంత్రకార్యక్షమత్వము గాంచి వృద్ధిక్షయంబులవిధము తెలిసి
చతురుపాయవిచారచాతుర్య మిరవొంది షడ్గుణాపజ్ఞాప్రశస్తి నెరసి
రాజ్యాంగసప్తకరక్షకస్థితు లూని ద్వాదశరూపవిభేద మెఱసి
మతిబలస్ఫూర్తి నలబృహస్పతికిమించి, యఖిలవిద్యలనెచట†సాప్యంబులేక
యప్పురంబున నలరుదురనుపమాన, మానగుణరత్నఖనులుప్రధానఘనులు

§పదంబులనం—మూ. *రాముసంగ—మూ. †ఆవార్య—మూ. †నాప్యంబు—మూ.

క. ప్రథమానిర్దిష్టతఁ బ్రా, గ్బ్రథగణ ముపసర్జనత్వబోధకు నమరుం
బ్రథమానిర్దిష్టత నగు, ప్రథ నుతధన్యత్వ మొనరఁ బరఁగి రమాత్యుల్.

వ. ఇట్లు సకలపురలక్షణలక్షితం బై నిఖిలలోకవీక్షాపేక్షాసేచనకం బగునప్పు
రంబును ధరానుకూలవల్లరీనాయకరత్నం బెవ్వ రనిన.

చ. కలఁగనివాఁ డదెన్నఁటికిఁ గాననివాఁడు జగద్ధితార్థి యై
కలఁగనిమానవప్రకృతిఁ గాంచినవాఁడు నిజాశ్రితాభిదా (?)
గలకనియైనఁ గావనను కట్టడిమాటకుఁ గానివాఁడు మే
ల్కలఁగనిచాయ నవ్వఁగనుగల్గిన నిద్దపుమోమువాఁ డొగిన్.

ఉ. తప్పనివాలువాఁ *డనిని దప్పనిమాటలవాఁ డొకప్పుడుం
దప్పనివాఁడు నమ్మికలు దప్పనిబంతి మెలంగువానివె
న్దప్పనివాఁడు తప్పులకుఁ దప్పనివారలఁ బ్రోవనన్నవా
తప్పనివాఁడు ద్వారవతిఁ దప్పనినీతిగ నేలు నెప్పుడున్.

సీ. సచ్చిదానందలక్షణలక్షితుం డౌచు వేదాంతలక్ష్యత వెలుఁగు నెవఁడు
జగదుద్భవస్థితిసంక్షయహేతుత సర్వజ్ఞతాతిప్రశస్తుఁ డెవఁడు
మాయానుబింబితమహనీయతేజుఁడై క్షేత్రజ్ఞవృత్తిచేఁ జెలఁగు నెవఁడు
సేవకాభీష్టార్థసిద్ధ్యర్థమై బహురూపనామముల నిరూఢుఁ డెవ్వఁ
డతఁడుపరముండుసకలలోకానుశాసనార్థమయథార్థమనుజవేషార్థియగుచు
గృష్ణుఁ డనునామ మఘవనకేలి గాఁగ,నతిముదంబున ద్వారకనధివసించు.

సీ. ప్రామిన్కుఁగమితమ్మిపట్టుపట్టగునంచ యంచ తేజీజేనిఁ గాంచు వేల్పు
వేల్పురాఁబాచాయ వెలయు చక్కనితండ్రి తండ్రి నెఱుంగక తనరుప్రోడ
ప్రోడచేరువకాండ్రఁ బ్రోచుమీఁదటిగిడ్డి గిడ్డిమందలనుండు దొడ్డజంత
జంతరక్కసికానదొంతు లేర్చెడుచిచ్చు చిచ్చుకన్గలవాని నచ్చుజోడు
జోడుకన్నుల సెకఁ జల్వఁ జూపుమేటి,మేటినుడివాలుఁ దాల్చినమేలుబంతి
బఁతివలె వ్రేల బలుకొండఁ బట్టుదిట్ట,దిట్టముగ నేలు నవ్వీడు తెలివిమీఱి.

సీ. తనసుదర్శనలీల తనసుదర్శనలీలకరణిచేఁ బరదానగరిమ మెఱయఁ
దనవిక్రమస్ఫూర్తి తనవిక్రమస్ఫూర్తియనువున జగముల నాక్రమింపఁ
దననేత్రమహిమంబు తననేత్రమహిమంబుపగిదిఁ జిత్రాలోకపటిమ నెఱపఁ
దనకరాంభోజంబు తనకరాంభోజంబుపోల్కి వసాధ్వసామోదము లిడ

---

*వనిన.

ద్వారకాపురి నేలు నుదారమహిమ, మహిమలయుభారము డుపఁగా మనుజలీల
నతిపరాయత్తసంరక్షణక్రియాప, రాయణుం డగునట్టి నారాయణుండు.

సీ. నిగమశిఖాపద్మినీచారుహంసంబు నిరవద్యసద్గుణనీరరాశి
నిజదాసఖేదాగ్నినిరసన‡నాంభోదంబు నిర్మలకీర్తిధునీమహాద్రి
నిఖిలార్థదాననిర్నిద్రభూమీజంబు నిరుపమవైభవనిత్యవసతి
నిరవధికానందనియతినివాసంబు నిటలదృఙ్మఖసురనికరనేత
యలరు ద్వారక సర్వలోకాతిశాయి, చాతురీలేశ(హత)బహుళాతతాయి
(సాధు)చేతనమానసోత్సవవిధాయి, మాయిజనమాయివిబుధసన్మానదాయి.

సీ. సైంధవజలమధ్యసంచార మందుట గిరిధారణోదీర్ణకీర్తిఁ గనుట
భూదారభావంబుఁ బొందుగాఁ బడయుట నరసింహవేషంబు నలువుకొనుట
బలిదైత్యగర్వసంపత్తి హరించుట రక్తైకతర్పణరతి నెనయుట
ఖరదూషణోద్వృత్తి కలిమి వారించుట నిజకామపాలత నెఱి మెలఁగుట
యతిపరశ్రుతిగతుల సన్నుతి గలుగుట, నతులితంపుఁబ్రసాదిత్వమానిమనుటఁ
బూర్వపరలీలలప్పడ పూనికొనుచుఁ, గృష్ణుఁ డలరారు నధికరోచిష్ణుఁ డగుచు.

సీ. నెనరుఁజూపులవాఁడు గొనువానిఁ గనువానిఁ గనువానిఁ గనినరూపౌనరువాఁడు
పొనరునవ్వులవాఁడు మొనమించు మొనమించు మొనమించు జగివల్వ నెన [యునాఁడు
భంగ మందనివాఁడు రంగారు బంగారు బంగారుఁబోఁడి చేపడినవాఁడు
కడలినుండెడివాఁడు కడపల్లుకడపల్లుకడపల్లుమహిమంబు గాంచువాఁడు
కలఁడు లేఁడను రెండుమాటలకు మించి, వింత యగుకల్మిచే విఱ్ఱవీఁగువాఁడు
కృష్ణుఁ డనుపేర నఘు మఱఁగించువాఁడు, పురుషుఁ డాద్యుండు ద్వారకాపు [రికి ఱేఁడు.

వ. వెండి యు జగజ్జన్మాదికారణం బైన యప్పురుషోత్తముండు నిఖిల*విశ్వం భరాభరారోపసంహారార్థంబుగా దేవకీవసుదేవులకుఁ బుత్త్రభావంబున మాయామానవశరీరం బవలంబించి యతం డునుప నందయశోదానందకరం బై నందునిపల్లియయందు యశోదాతపఃఫలాయమాన నిజశిశుశరీరపోషణుండై వసియించుచుఁ దత్కాలంబునఁ బూతన విగతచేతనం గావించి శకటాసురు హరించి తృణావర్తు నడంచి నిజైశ్వర్యజ్ఞాపక విశ్వరూ

‡నాంభోజంబు—మూ. *విశ్వంభరాభరా భరారోపసం—మూ.

పప్రదర్శనాద్యద్భుతంబుల యశోద న్విస్మయానందంబుల నందించి యమ
ళార్జునంబుల భంజించి బృందావనంబున గోపాలబాలకబలరామసహి
తుండై గోవత్సపరిపాలనం బభ్యుపగమించి వత్సాసురు విదారించి బకదై
త్యు మర్దించి యఘాసురు ఖండించి చతుర్ముఖమాయావినిర్మిత గోగోపవ
త్సాపహరణనిమిత్తంబునం దాన గోగోపవత్సరూపంబులు ధరించి విహరిం
చి ధేనుకు మథించి యమునాహ్రదంబున నుండు కాళీయోరగంబు వెడలిం
చి దవానలంబుఁ గబళించి ప్రలంబునకు బలునిచే లయంబు ఘటింపించి గో
పకన్యాసహస్రక్రీడనం బంగీకరించి విప్రభామలఁ గరుణించి గోవర్ధనాచ
లం బుద్ధరించి సుదర్శను శాపవిముక్తుం గా నియమించి శంఖచూడు
జముం జూడం బంచి వృషభాసురు మాయించి కేశిదైత్యు*మాయించి
వ్యోమాసురు నిర్జించి మధురాపురంబునఁ గువలయాపీడమహాగజంబుఁ
ద్రుంచి కుబ్జావక్రతానివారణాద్యద్భుతకృత్యంబులు నిర్వర్తించి బలరామ
సహితుండై ముష్టికచాణూరుల నిగ్రహించి కంసన్యగ్రోధాది నృశంసుల
హింసించి యుగ్రసేనుఁ బట్టాభిషిక్తుం గా ననుగ్రహించి ‡ బ్రహ్మచారితోరీ
కరణపూర్వకంబుగా సాందీపుని సమీపవర్తిత్వం బనుసరించి పంచజనుం
గీటడంచి తద్దేహగతశంఖంబు ధరియించి జమునివలనం దెచ్చి గురునకుం
బుత్రు నర్పించి యక్రూరముఖంబున గోపికల ననునయించి జరాసంధుఁ
గాందిశీకుంగా ఘటియించి కాలయవనపరిత్రస్తమధురాపురజనావనార్థంబు
వార్ధిమధ్యంబున ద్వారకానగరంబు విశ్వకర్మనిర్మాతచే నిర్మింపించి యందుఁ
దన యోగమాయా బలంబున మధురానివాసుల నందఱఁ బ్రవేశింపించి
ముచికుందుచేఁ గాలయవనుసమయసంకల్పించి ముచికుందుం గృతార్థసార్థ
వాహుంగా నభిమతించి జరాసంధుఁ బునర్దండయాత్రానిమిత్తక ప్రవర్షణప
ర్వతారోహణానంతరంబ తద్గిరిదాహంబు గావించి బలరామ సహచరుం
డై ద్వారవతియందు నివేశించి తదనుసమయంబున రుక్మిణీనామంబున
మానుషీవేషంబున దీపించు మహాలక్ష్మి లక్షణవతిం బరిగ్రహించి యాభా
గ్యవతియందుఁ బ్రద్యుమ్నకుమారు నుత్పాదించి జాంబవతిం వరియించి సత్య
భామం బరిణయించి శతధన్వుని సమయించి దీపించుచు మఱియు ననేక
థాపన్నం బై యుపమాలంకారంబు ననుకరించుచు ద్వితీయ ప్రతిభటరహి
తం బై యనన్వయంబు ననుసరించుచు, నేకధర్మాశ్రయం బై యుపమేయో

* ఇఁ కూడ మాయించి యనియే యుండును. ‡ బ్రహ్మచారితోరీకృతకరణపూర్వ-మూ.

పమాలంకారంబు హసించుచు భేదాభేదవాదనిదానం బై స్మరణాలంకారం
బు నిరసించుచుఁ బ్రకృతోపరంజకం బై రూపకాలంకారంబు ననుగ్రహిం
చుచుఁ బ్రకృతోపయోగిక్రియార్థాప్రాకృతస్వరూపం బై పరిణామంబు నా
దరించుచు రసికజనప్రతిభావిలాసగృహీతానుభవం బై భ్రాంత్యలంకారంబు
లోఁగొనుచు నిషేధవచనప్రతియోగి యై యపహ్నవాలంకారంబుఁ గా
దనుచు బహుజనపరికల్పితబహూల్లేఖం బై యుల్లేఖంబుఁ బైకొనుచుఁ
ద్రిప్రకారమనోహరం బై యుత్ప్రేక్షాలంకారంబు మాఱ్కొనుచు ననిశ్చ
యాంతం బై సందేహాలంకారంబుఁ దోడుకొనుచు మహావాక్యప్రతిపాది
తైకత్వం బై నిదర్శనాలంకారంబు విడంబించుచుఁ గవిప్రౌఢోక్తివిషయం
బై యతిశయోక్త్యలంకారంబుఁ దిరస్కరించుచు నవజ్ఞా‡తవర్ణ్యం బై
ప్రతీపాలంకారంబు నిందించుచు బింబప్రతిబింబభావోపేతం బై దృష్టాంతా
లంకారంబుఁ బరీక్షించుచు హితాహితతుల్యవృత్తికం బై తుల్యయోగితా
లంకారంబు నాజ్ఞసేయుచుఁ బ్రసిద్ధాధిక్యవిలసితం బై వ్యతిరేకాలంకారంబు
వంక లెన్నుచు సమాహితసార్థముక్తినిలయం బై సహోక్త్యలంకారం
బు నాక్షేపించుచుఁ దత్ప్రతిభటశబ్దార్థసంసేవితం బై వినోక్త్యలంకారంబు
ననుగమించుచు నర్థాంతర†సమాక్షేపాధిష్ఠానం బై సమాసోక్త్యలంకా
రంబు నుల్లసం బాడుచు సద్భావరమ్యం బై పరికరంబుఁ గినియుచు నా
నార్థనిధానం బై శ్లేషాలంకారంబుఁ జౌకసేయుచుఁ బ్రస్తుతకార్యప్ర
త్యాయనసమర్థం బై యప్రస్తుతప్రశంసాలంకారంబుఁ జౌకళించుచుం
గార్యానుమేయకారణభావం బై ప్రస్తుతాంకురాలంకారంబు నవఘళించు
చు వ్యాప్తిసముల్లసితం బై యనుమానాలంకారంబు బెదరించుచు విశేష
భావగమ్యం బై పర్యాయోక్త్యలంకారంబు విదళించుచు *విధినిషేధవచ
నమూలం బై నిషేధాలంకారంబుఁ బ్రతిషేధించుచుఁ బరిహృతవిరోధం
బై విరోధాభాసాలంకారంబు విరోధించుచు నకార్యసంబంధం బై విశేషో
క్త్యలంకారంబు నవమానించుచు నకారణకార్యవశంగతం బై విభావనా
లంకారంబు నిరోధించుచు విలక్షణకార్యోత్పత్తిమంతం బై విషమాలంకా
రంబు బహూకరించుచు విచిత్రప్రయత్నసంబంధి యై విచిత్రాలంకారం
బుఁ బోనాడుచు సూక్ష్మోదారం బై సూక్ష్మాలంకారంబు మన్నించుచుం

---

‡తాపర్ణం బై-మూ. †సమాధోపాధిష్ఠాన-మూ.

*విధ్యలంకారవిషయ మిందు లోపించినదేమో.

‡గారణమాలాలంబం బై గుంభాలంకారంబు ఘర్షించుచు గృహీతముక్తం
బై యేకావళ్యలంకారంబుం గసరుచు దీపకైకావళీయోగం బై మాలా
దీపకంబుఁ గికురించుచు నుత్తరోత్తరగుణోత్కర్షం బై సారంబు వెలపిం
చుచు మఱియు నుపాదానలక్షణలక్షితం బై జహదజహల్లక్షణావ్యాపార
ద్వయంబు జయించుచు వృద్ధ*నిష్టాపదసర్వనామస్థానం బై సంస్కృతశ
బ్దానుశాసనంబు ననుశాసించుచుఁ జతుస్సాధనాభిగమ్యం బై ప్రమాణ
దర్శనంబుఁ జుంబించుచు, నిశ్చితవేదార్థం బై వాక్యశాస్త్రంబుఁ గేలిసే
యుచు నద్విత్వం బై ప్రాకృతవ్యాకరణంబుఁ గారించుచుఁ బ్రత్యయసుల
భం బై ఛందంబు నపలపించుచు స్థిరప్రాణ్యుపకృతిపదం బై వికృతివ్యాక
రణంబు నపహ్నవించుచుఁ బ్రకృతివికృతిసంశ్రయం బై మహానాటకంబు
నదరించుచు నమితం బై గద్యకావ్యంబుఁ గాకుపఱుచుచు సువృత్తావృతం
బై చంపూప్రబంధంబు ననుబంధించుచుఁ గళాస్వరసహితం బై గాంధర్వ
విద్యం గంపించుచు నస్తోకహస్తలక్షణమధురం బై భరతంబు గనికరించు
చుఁ దనరూపంబు మిగుల వెలుంగ నసముండేని సముం డై యదరుం డ
య్యు సదరుం డై యరిభరణప్రవీణుం డయ్యు నరిహరణప్రవీణుం డై స
విశేషుం డయ్యు నవిశేషుం డై యమానుం డయ్యు సమానుం డై యగ
దుం డయ్యు సగదుం డై వనవిహారశీలుం డయ్యు నవనవిహారశీలుం డై
సోదయుం డయ్యు ననుదయుం డై శేషి యయ్యు నశేషి యై యహీన
నిద్రాముద్రుం డయ్యు నిద్రావేశరహితుం డై యనర్జునుం డయ్యు నర్జు
నాధారత మెఱయుచు లోకబాంధవుండు గావునఁ గమలాలయామోద
ఘటకత్వంబునం దమోహరణపాటవంబునఁ జొటిల్లుచు స్పర్శవిధుండు గా
వునజగదాహ్లాదకరత నమలినతారావళీమనోహరతం బ్రవర్తిల్లుచు సమవ
ర్తిగావునం బ్రియాప్రియతుల్యయోగదండధరత ధర్మనిర్వాహణధురంధరత
నాలంబించుచుఁ గాలుష్యంబు వర్షాసరిత్సరజ్జలకుపితాంగనాహృదయంబు
లయంద పదనియమాభావవర్ణవైపరీత్యంబులు ప్రాకృతవ్యాకరణంబునంద
యస్పష్టాలంకారత సురతమృదితముదితాధ్వనికావ్యంబులయంద విరాగత
చుంబితకాంతాధరంబులయంద యసుందరత్వంబు మధ్యమకావ్యంబులంద
నీరసత్వంబు వజ్రాదిమణిచిత్రకావ్యంబులంద నిరర్థకత్వం బపుష్టపదంబులం
ద యకళావత్త్వంబుద్రుతప్రకృతులయంద వక్రత కాంతాఘాలాలక శరవిశే

‡ ఇందుఁ గారణమాలాగుంభశబ్దములు తాఱుమాఱు అయినవి. *శిష్టా-పూ.

షార్ధచంద్రులయంద ప్రత్యాహారవర్ణాకర్ణాకృష్టధనువులయంద కఠిన
త లలనాకుచకటితటంబులయంద నీరసకావ్యతర్కోక్తికదంబంబులయంద
ప్రదోషత రజనీముఖాసంస్కృతంబులంద యర్థభేదంబు శ్లేషయంద వృ
త్తిభిద యలంకారశబ్దమనంబులంద నిర్దయత మదనకదనకదనంబులంద
స్వపక్షాభావంబు కేవలవ్యతిరేకహేతువునంద దారిద్ర్యంబు మృగతృష్ణా
మృగేక్షణామధ్యంబులంద కళంకంబు కళానిధియంద చాంచల్యంబు చం
చలాక్షీకటాక్షసైంధవఖురాంచలంబులంద యనమ్రత యసజ్యచాపంబు
లంద యప్రసాదంబు మేఘావృతదినంబులంద యగుణాశ్రయంబు సురత
భిన్నహారంబులంద యహిభయంబు పాతాళంబునంద యస్ఫుటత్వంబు వీణా
కలకలవాద్యభేదంబులంద మానభంగహేతుత నాయకకృతనాయికాచర
ణపాతంబునంద పక్షచ్ఛేదకర్తత సముద్రతరంగంబులంద యనభిజ్ఞనిబంధ
నంబులంద యపాత్రత యుపరత నాట్యరంగస్థలంబులయంద మిథ్యావాది
త యద్వైతవాదులంద యప్రకాశత గుప్తనైతానాగ్నులయంద వికృత
భావంబు ప్రాకృతాంధ్రభాషలయంద సమాధి పదబంధయోగింద్రమాన
సంబులయంద మెలంగ నఖిలజనులు నగ్నిమాడ్కి శుచిమంతు లయ్యుఁ
దాపకారిత్వ మెఱుంగక చంద్రుమాడ్కి నాహ్లాదకరు లయ్యుఁ గళంకులు
గాక రవిభాతి సాభ్యుదయు లయ్యు నస్తంగతిఁ గొనక మేరువుకైవడి ను
న్నతు లయ్యుఁ గాఠిన్యంబు గనక పయోధిచెలువున గాంభీర్యరత్నాకరం
బులు గాంచియు భంగంబులు డెలియక కుబేరువడువున నర్థసంపన్ను ల
య్యుఁ బరాశ్రయంబు సేయక యింద్రువైఖరి నిరుపమభోగశాలు లయ్యు
దృష్టిభేదంబు లధిగమింపక యనుపపన్నఖేదు లై యనుగతమోదు లై
యప్రాప్తాపవాదు లై యాశ్రితసాధువాదు లై యనురసప్రసాదు లై య
తిప్రియవాదు లై యతిశయితవినోదు లై చెలంగం బరిపాలనంబు సంజా
ఘటించు సమయంబున.

—: కథాప్రారంభము :—

క. రిక్కలదొరకళ కిది యమ్మక్కనదే యెంత చెలువ మమ్మక్క యనం
జక్కఁదనంబుల కుప్పగు, నొక్కసరోజాక్షి రవితనూభవ యలరుఁన్.

క. అందముగల తలిదండ్రు ల, మందానందమునఁ బెనుప మందిరమునఁ గా
ళిందీనామతఁ బెరిఁగె న, నిందితయమునాతరంగిణీసోదరి యై.

వ. ఇట్లు పెరుఁగుచు సబ్బాల తనశైశవంబున.

సీ. చెలులతోఁ బరివేషములు మేలుతనబొమ్మరిండ్లుగాబొమ్మపెండ్లిండ్లు సేయుఁ
దారకాగ్రహవీథితరుణులతోఁ గూడి యొప్పుగా వెన్నెలకుప్ప లాడుఁ
దనరారు నయ్యింద్రధనువులపై నెక్కి యింతులతోడ నుయ్యేల లూఁగుఁ
గూర్చుకన్నియలతోఁ గూడి కుంభంబునఁ గొమరొప్ప గుజ్జనగూళ్లువండు
మొగులుచాటున* దాఁగిలిమూఁతలాడు, సప్తఋషిబాలికలతోడ సరసమాడు
నంచబోదల కెల్ల నాట్యములు గఱపు, బాల నవశైశవారంభవేళలందు.

చ. జలదముమాటునం బొలిచి చాన మెఱుంగయి మిన్నువాఁకయం
‡చలమునవిల్చి యంచయయి, చంద్రుపిఱుందఁ దదీయరేఖయై
మలయును బువ్వుఁదీఁగియలమాటునఁ గల్పకవల్లి లీలయై
లలిఁ గికురించుఁ దోడిచెలుల న్నతి† దాఁగిలిమూఁతలాడుచున్.

క. నీలాభగవత్యంశజ, బాలిక బాలారవిందపంక్తులు దిశలం
జాలం జాల రచించును, లీలన్ శ్రమపడుచుఁ? దనదులేఁజూపుగమిన్.

క. దిన మొక్కచాయఁ బెరుఁగుచు, వనజాయతనయన చూడ వన్నెఁదనర్చెన్
మనసిజుఁ డాడింపఁగ గవ్విసన దీసిన పసిఁడిబొమ్మచందము మెఱయన్.

చ. మదవతి వాక్యపద్ధతి సమంచితరీతి ఘటిల్లె వర్ణముల్
పదులు గణింప నైదు నొకపట్టున నొక్కొకచోట నాలుగే
పదులు వసించు నొక్కయెడఁ బాయును నాల్గు లిపుల్మఱొక్కెడం
గదిసి మెలంగెడుం దెలియఁగాఁ బదియు న్మఱి నాల్గువర్ణముల్.

క. వైదర్భిమీఱు నెచ్చెలి, వైదర్భీరీత్యుదీర్ణవైభవరసధా
రోదారకవిత యెట్లు ప్రమోదావహ గాదు రసికపురుషుల కెల్లన్.

క. పదచిత్రతార్థచిత్రత, లొదవినకవితయు విచిత్రమొగిఁ గనుపట్టెం
బదగతుల సోపమంబై, యది నిరుపమ మగుచు మెఱసె నబ్రముచూడన్.

సీ. సుప్తిఙ్విశేషసంశోభితత్రివిధశబ్దంబులు దోషసర్వస్వ మెడల
శయ్య నమర్చుచు సత్పాకశుద్ధిగఁ ద్రివిధగుణంబుల రీతు లమర
వృత్తులు చెలువార వివిధరసానుగపదవర్ణసమసనప్రాప్తి లొనర
వ్యంగ్యంబు మువ్వన్నె లమర శబ్దార్థవైచిత్రివిశేషము ల్వెన్నుమిగుల
వాగ్బలం బైనకవిత చెప్పంగ నేర్చెఁ, బ్రాఁతచదువులప్రోవుగాఁ రాఁపుఁబట్టి
విమలతచ్ఛ్రీతిమాధురివిన్నయపుడు, కవిగురులుకవితగురుతయుఁగాంచఁగలరె.

---

* దొంగుడుమూఁతలాడు-మూ. ‡ యంచలదమునిల్చి-మూ † దాఁగిలిమూఁచులాడుచున్.

సీ. సంతతసన్మార్గసంచారిణిగఁ జేసె సారసాహారిహంసవ్రజంబు
వీణాక్వణత్పాణి వాణి యంతర్వాణి వాణీవిశేషసర్వజ్ఞఁ జేసె
బంధురగాంధర్వపాండిత్యనిధిఁ జేసె విమలాశ్వవదనసాధ్వీజనంబు
సర్వభారతశాస్త్రగర్వితగాఁ జేసె రమితగీర్వాణపర్వాబ్జముఖులు
కల్పితానల్పసంకల్ప(కావ్య)కథల, లలితరీతులు మీఱఁ గల్పనలు చేసె
దద్దివ్యమునిసతీతిలకకులము, వెలయఁ గాళింది నబ్బాల్యవేళయందు.

సీ. ఉదయవేళల వాణి యురునృత్తబహువృత్తిబోధకగ్రంథము ల్వాసఁగ నేర్పెఁ
దనువాతిమెడ ధరాధరరాజనందన మహితాగమోక్తి మర్మములు తెలిపెఁ
దాఁపిమ్మట రమాతరళాక్షి రత్యలంకారశాస్త్రములు బోంకముగ నేర్పె
నెడనెడ రశ్మిత నెసఁగు పన్నగరాజు శబ్దరహస్యంబు చక్కఁ బలికె
గౌతమవ్యాసకణచరకపిలజైమి, నులు స్వనిర్మితదర్శనంబులు నొడివిరి
మూఁడుమూర్తులముద్ద యాప్రోడ తండ్రి
యంకమునఁ బ్రోదిగాంచు నియ్యబ్జముఖికి.

క. చదువులగని కన్నాయన,చదువులు గ్రహియింపనేర్చు *సవిత్రతనుజ దాఁ
జదువులు సాకల్యంబుగఁ, జదివె ననుచు వర్ణనంబు చలుపఁగవలెనా.

వ. అంత.

మ. గణుతింపన్ స్మరజీవనౌషధి యనంగబ్రహ్మతంత్రాంకురా
ర్పణసర్వంసహ కామదైవతసపర్యావాహనాకారణా
క్షణ మస్త్రజగత్త్రయీవివశకృత్సంమోహనాస్త్రంబు భూ
షణసాకల్యసమానవేష మయి యోషాయౌవనం బొప్పెడిన్.

క. ముంగురులరంగు లలవడె, నంగనపాలిండ్లు మిట్టలై కనుపట్టెన్
అంగముల మెఱుఁగు లెక్కెను,శృంగారముతోడఁ జెలికి సిగ్గును గదిరెన్

సీ. నానాఁట నవయౌవనంపుఁబూఁదోఁటలో రహింపించు మదనాంకురంబనంగ
ననుపమనవయౌవనారంభజలరాశి లలిఁ దేఱు పవడంపులతిక యనఁగ
సరసలావణ్యవర్షాకాలఘనవాటి రఁగుమీఱిన క్రొమ్మెఱుంగు గనంగ
సలలితప్రాయంపుసానఁ దేఱి లసించు నసమాయుధుని మోహనాస్త్రమనఁగ
బాలశశిరేఖ దినదినం బోలి నెగడి, మెఱయఁ గళలంతకంతకు మిక్కుటముగ
వరుస సంపూర్ణభావత వఱలుకరణి, నమరెఁ గాళింది నవయౌవనాగమమున

---

* సరసతనుజ-మూ.

మ. తెఱపై బాల్యము వోవ బాల యతిదీప్తిం జూడఁగా నొప్పె వా
తెఱసొంపుం గటిపెంపు మేనుజిగి యుద్దీప్తస్తనౌన్నత్యము
న్మరిపంపున్నడతీరు పాదములయొప్పుం గాను లేమిం గనన్
ఓలివారాయన్ జళిపింప నమ్మరునిచే నొప్పారుఖడ్గం బనన్.

సీ. కుటిలప్రచారము ల్కుంతలంబులఁ జెందెఁ జపలభావము నేత్రసరణిఁ జేరెఁ
బంకసాంగత్య మేర్పడ ఫాలమున నుండె నతిరాగవిలసనం బధర మంటెఁ
గఠినత్వమెల్ల నొక్కటఁ గుచంబులఁజెందెఁ బట్టువీడమి నితంబముననిలిచె
కలుము లెఱుఁగముల్ గానుఁదీఁగె వసించె జాడ్యంబు నడపులజాడనమరె
మురిప మెల్లను సిగ్గులో ముడిఁగికొనియె
*గుర్తెఱుంగమి యలనాభిఁ గూడికొనియె
నెలఁత తనబాల్యచేష్ట లన్నియునుఁ దన్ను
బాయకుండఁగ నొప్పె యౌవనమునందు.

చ. అలరువసంత మబ్బినపుడౌ నొకకొన్ని దినంబు లింతె మా
కలుషములు నప్పుడు న్నమతకై ‡కొఱగా మని పల్లవంబు లా
జలజదళాక్షిపాదజలజంబులు గైకొని పూజసల్పు న
య్యలరు లనాఁగఁ బాదనఖరాంకురము ల్గనుపట్టు నింతికిన్.

క. జిగి దప్పి చుక్కగమి యా,మగువపదనఖాలితోడ మార్కొనలేమిం
బగ లుడిగి యుండుటం గద,గగనములో డాఁగి రేయి గననగుటెల్లన్.

గీ. నిలుక డెఱుఁగని చిగురాకునీట దెంత,ఆపడిన పద్మరాగమ్ము రాణ యెంత
సొగసుఁగెందామరలసొంపుచూఱకొన్న,వనితపదములతో సాటివచ్చు టెట్లు.

చ. ఎడసినకాండసంపదల కెంతయు స్రుక్కుచు వాడు టంది తా
లుడుగని వేఁతకోఁతలకు నోర్చుదొన ల్కలమంపుగర్భముల్
జడిమ వహించెఁ గాన సతిజంఘలతో సరిగాఁగ నేర్చునే
జడమతులైనవారలకుఁ జక్కఁగఁ జిక్కునె సద్విచారముల్.

క. సరసిజలోచనజంఘల, సరివత్తు మటంచువచ్చి శరములపాలై
యిరుగడలఁ గట్ల పాలై, శరధులు కడు నొగిలెఁ దగనిసాహస మగునే.

క. మృదుపదనై మాధుర్యా,స్పద మై చెలిజంఘ రసము చాలఁగఁజిలుకన్
మృదుపదనై మాధుర్యా,స్పదమై యలరారు రచనవడువు దలిర్పన్.

---

*గుఱెఱుంగమి—మూ. ‡సమకైగైకొరగామని—మూ. ౧. సమకైగైకొనఁగా?

క. పొరలేక సరస తెడలక, వరపల్లవవితతితోడ*వర్తింపక యి
ద్ధరపైఁ బడి తలక్రిందై, పరఁగిన సరిరాదు రంభ పదతతితోడలతోన్.

చ. తలవిరియంగఁ బోసికొని తద్దయు నాకులపాటు దోఁపఁగా
జలముల నెప్పుడు న్నిలిచి సర్వశరీరము భూతిలిప్తమై
వెలయఁగఁ బండ్లుఁ బూలుఁగొని వేసరకెప్పుడు మోచ దాఁ దపం
బలవడఁ జేయుచున్నయది యర్కసుతోరుతులా‡ఫలార్తితన్.

క. అతిమృదు వగుసతియూరుల, నతికఠినపుఁగరికరంబు లారసి చూడ
న్మతి రాదయ్యెఁ బ్రతీపమొ,హిత మట్లా నుపమ నుడువ నిలఁ బ్రాజ్ఞులకున్.

సీ. పూర్వాపరరూపమంజిమస్ఫూర్తిఁ గాంచి
చెలువకటి పాణిసీయంబుచెన్ను గాంచుఁ
బృథ్వి విపులాతిహృద్యసద్వృత్త మగుచు
వేదపాదం బనా మది వేడ్కఁ జేయు.

క. నీల తానొట నయ్యలి, నీలాలక పిఱుఁదురుచిని నిర్జించె నిలన్
వేలాతిగసర్వాంగ,శ్రీలన్ శ్రీగెలిచె సవతిచిట్టక మమరన్.

సీ. దిరదిరం దిరిగెఁ†గుమ్మరసారె రవిజాతపిఱుఁదుతో మురిపంబుఁ బెరుఁగవచ్చి
నట్టేటఁ బడియె మానక సైకతంబులు చెలిజఘనంబుతోఁ జెనకవచ్చి
బలుగిరిదుర్గంబుపా లయ్యె ధారుణి పైదలికటి సరిపడఁగ వచ్చి
రారాపిడులఁ జొచ్చె దోరంపుటద్దముల్ పొలఁతిశ్రోణిచ్ఛాయఁ బూనవచ్చి
గండ్లఁబడిపోయె నరదంబుగండ్లు ముగుద
కాంచికాస్థానగరిమంబు గనఁగవచ్చి
పరుషవిషమత్వములు మ్రానుపాటు తమకు(?)
దలఁపనివి(లేవు) బాలానితంబమునకు.

క. అరుదైన చక్రవర్తిత,సరసుల సహవసతి గలదు చాలుదు మనియో
కరము భ్రమంపడి తిరిగెడు, దరుణీమణినాభిసదృశతకు సుళ్ళెపుడున్.

క. లలనామణిపక్షంబునఁ, గలిమియు లేమియును నెఱుఁగఁగానినడుము దాఁ
గలదని తెలియఁగఁ జేసెన్, బలునాభీగహ్వరంబు పరిదృష్టంబై.

క. గూఢాగూఢవ్యంగ్యము,రూఢిం గనికనము లమరురుచులు దనర్పం
బ్రౌఢపయోధరమధ్యము,ప్రౌఢులమతి సమ్మదం బపార మొనర్చున్.

*వర్తింపగ—మూ. ‡ఫలాధితన్—మూ. †కుంమ్మరసానే—మూ.

ఉ. ఆరమణీశిరోమణికుచాద్రియుగాంతరసీమఁ బుట్టుశృం
గారరసంపుజాలనఁగఁ గానఁగనయ్యెను ముద్దుగుల్కు నూఁ
గారది నిల్వఁగా నయినయమృతనిమ్న మనంగ నొప్పుచె
ల్వారెడు నాభిగహ్వర మయారె మృగీదృశరూపవైఖరిన్.

క. అరయఁగమనమున్ దివియుం,బరమాణువుఁ గలదటంచుఁ బరికించిన వే
హారిమధ్యనడుము సంశయ,పరమాస్పద మౌట నెట్లు పాటిలు నుపమల్.

గీ. చారుతర మైననాభిశృంగారసరసి
రసము వెల్లుబ్బి కుచమహీధ్రములనంటి
పాఱునూఁగారుజాలుపైఁ బయలుపడెడు
కరడు లనమించె ముద్వళుల్కమలముఖికి.

మ. లలిశృంగారరసప్రవాహ మొనరన్ లావణ్యవర్షాగమా
కలనోద్భూతవళీతరఁగములు పేకం దాఁకఁ బెల్లుబ్బును
జ్జ్వలతేజోమయ బుద్బుదద్వయము నోజన్మించె నయ్యింతి మే
ల్వాలిచందోయి మెఱుఁగు లుల్లసిలు భాస్వద్బాహుమూలాంతమై.

చ. అరయఁ ద్రివేణికాజల మనంగుఁడు గ్రుంకఁగ జవ్వనంపు మే
ల్సిరి కడు నించి డింప నొగిఁ జెల్వ(గు)పైఁడి పసంట్లు గుబ్బలొ
నురవడి డించుదోఁ దోడఁక నొప్పెడు జాలనఁ గాన నయ్యెడు
న్వరహారినీలమౌక్తికసువర్ణనిబద్ధవిభూషణప్రభల్.

క. అప్రకృతభూధరాదుల, కప్రకృతం బయ్యెఁ జెలువయప్పుగుబ్బల్
అప్రకృతతయునుబ్రకృతత,యాప్రకృతపుఁజన్నుదోయినెనయుఁ గ్రమమునన్.

చ. కలయఁ బ్రసాద మొప్ప నధికస్ఫుట మై మధురత్వ మొందఁ గే
వలపరుషస్వభావపటుబంధము మీఱ సమస్తభూషణా
వలులు దలిర్ప సర్వరసవాసితఁ గావ్యమునాఁ జెలంగు నె
చ్చెలిచనుదోయి క్లిష్టతనుఁ జేకొని మానదువో విసంధితన్.

క. ఉరుకుచభూధరపతికిం, గరిఘటములు మిత్రమయ్యెఁ గనకకలశముల్
పరికింప సమతఁ గైకొనె, నరులును సఖీభావ మందె నరుదు తలంపన్.

క. అరిగజకటదారణమున, నురుసుమనఃపంక్తిపోషణోదారతచేఁ
బురణించు మొనలు సూపుచుఁ, దరుణీవక్షోజభూమిధరరాజు కడున్.

ఉ. శంక యొకింత లేక చెలిచక్కనిబాహుల సాటి కేగఁగాఁ
బంకము జొచ్చి కంటకులపాలయి లో బలులేమిఁ జెందెఁ గాఁ

పంకజనాళ లట్లగుట వాని హరించు శుచిత్వవృత్తిచేఁ
గొంకక సత్పథంబు గొను కూఁకిమిగల్గినహంసరాజియుఁ.

చ. వననిధిఁ బుట్టి సన్మణినివాసము నై హరికేలు వట్టి యా
ధనపతియిల్లు సొచ్చియు ముదంబున మంగళసూత్రవైభవం
బునఁ దనరారనైతి నని పూనిక శంఖము చామకంఠ మై
ఘనత వహించి కాంచు మణికాంచనమంగళసూత్రసంపదల్.

క. నిటలాక్షుఁడు మూలంబున, నట హరిపత్రంబుమీఁద నమరుటకతన
న్వటఫలము ఫలము గాంచెను, బటుగతిసీయింతిచుబుకభావముఁగొనుచున్.

చ. సరసిరుహాక్షిదంతములసాటికి వత్తు మటన్నఁ గుందము
ల్విరియునుగా నిరంతరము వేసరి చీఁకటిబందిగంబులం
జొరఁబడి వాడుఁగా మిగులసూత్రముల న్సరిగట్ట నుక్కుఁగా
పొరిఁబొరిఁ గందుగా నెఱయ భూరికుచాంతరదుర్గసీమలన్.

గీ. *అక్షయంపుగుణస్ఫూర్తియమరెనేని, ఛిద్రములులేనిగుంభంబుఁజెందెనేని
తరణినందనముద్దులదంతపంక్తి, యాభిరూప్యంబు గాంచు ముత్యాలబంతి.

ఉ. పంచము లంట మే నిది యపాత్ర మటంచు వనాగమాంతశా
ఖాంచలవృత్తి నై చివు రుపాశ్రితమాధవసంగతైకర
క్త్యంచిత మై వధూటిమధురాధరతం జని చెందుటం గదా
కాంచెను సద్విజన్మపరికల్పితసంతతసంగసౌఖ్యముల్.

సీ. జలవాసతపమైన(న)జలజంబులకుఁ గళాధరునిరాకకుఁ బ్రమోదంబు లేమ
లలి నట్టితప ముత్పలంబున కగునేని మిత్రవైముఖ్యంబు మిగులుచుండుఁ
గలదు భిక్షావృత్తి గండుఁదుమ్మెదలకుఁ బాయిత్వ మెన్నఁడుఁ బాయకుండు
గగనస్థితవ్రతం బగుచకోరంబున కెన్న దోషాకరునింపు గదురుఁ
గాన చక్కని కాళిందికన్నుఁగవకు, నెన్ననివి సామ్య మేగతి నెనయఁగలవు
ఎట్టికష్టంపుఁదపమైన నిలవిగుణత, గన్న ఫలమిచ్చుననుమాటగలుగుటెల్ల.

గీ. నిచులబంధవరాలోకనిస్స్రమీళ(?),లమలమాధుర్యరసవైభవాస్పదంబు
లగుచుఁజెలువారుకాళిందిసొగసుఁగన్నుఁ,లన్నలోఁతమ్మిలోఁయవియబ్జములకు.

సీ. చానకన్నులతోడిసాటిఁబూనఁదలంచి బ్రమసి బేడిసలు గాలములఁబడియె
జెలువయక్షులతోడిచెలిమి సేయఁగవచ్చి పొందమ్మిమొత్తముల్బురదబడియె

* యక్షయ్యగుణస్ఫూర్తి—మూ.

ముదితచక్షులతోడ మురువు సూపఁగవచ్చి కల్వలు నీళ్ల(లో) సుళ్లఁబడియె
మానిని నయనయుగ్మంబు జోడని లేటికొదమకన్నులు భీతి బెదరుపడియె
రమణిరమణీయతరవీక్షణముల తేట, లూనఁబోవుచుమదిరంబులూఁతఁబడియెఁ
బొలఁతి చూపులచెలువమ్ము బెళుకు లొలయఁ
గోరి తేఁటులు బికిరంపుఁగూడు గొనియె.

గీ. చన్పకమునువ్వుఁబువ్వునుసరవిఁగూడి, యింతిఘ్రాణంబునకుసాటినెనయలేక
వంతనంతంతకునుదలవంపుగాఁగఁ, బండుటలుచూడమే ధరామండలమున.

చ. ఎదుట మెలంగువస్తు వొకయించుక కన్పడనీని మైలతో
నదనునఁ బెట్టు తెల్పులకు నబ్బదు నిల్కడ లేదు మార్దవం
బిది కొఱగాదు జన్మ మని యెంచి రతిస్మరదర్పణంబు ల
మ్మదవతిచెక్కులై యెపుడు మానని తేట మృదుత్వముం గొనెన్.

క. నవనవరోచిర్నిచయ, ప్రవణము లగుకుందరదన శ్రవణంబులకు
న్నవ తనుచుఁ బల్కఁ దగునా, నవతను సరిగాక మెలఁగునవసంఖ్యనిలన్.

చ. చెలి చెలువంపుఁగర్ణములశ్రీ హరియింపఁగ నేల వచ్చె శ
ష్కులు లకటా వివేక మొనగూడక యయ్యపరాధ ముత్కటం
బిల నొనగూడె వాని కది హేతువుగా జను లెల్ల నిప్పుడున్
సలసలఁ గ్రాఁగునూనియలఁ జాలఁగఁ జాలఁగ ముంచి యెత్తుటల్.

క. కలకంఠిమృదుకటాక్షాం, చలరమ్యద్యుతులు నిండు శ్రవణద్వయి యొ
ప్పలు నించు*చీరసంబున, విలసిల్లెడుకూపయుగళివిధముం గొనుచున్(?)

చ. జలమరుపద్మనీలజలసంభవకైరవఖంజరీటప
క్ష్యలిహరిణాక్షిమీనహరిణాంకపతత్రుల దృష్టిమాత్రనే
తొలఁగఁగఁజేయుఁ గన్ను లని తోయజసూతి నవాఖ్యసంఖ్యల
న్నిలిపెను బాల్యయుగ్మమున నేర్పున నా సతిపేను లింపగున్.

ఉ. తియ్యన కాని యొండు మతితీ రొకయింతయుఁ గానరాదు నే
నయ్యలివేణికన్బొమలయందముఁ జెందనటంచుఁ జప్పనై
యొయ్యన బెండు గైకొనుచు నుండు మనోజునిచేతిసింగిణీ
యెవ్వెడఁ బిల్లపిల్లతర మించుకయేనియుఁ జేగఁ జెందెనే.

క. కనఁ గన మిగిలెడుమధురిమ, గనఁ జెలికన్బొమలతీరు గానక మరుచే
నన చెఱకువిల్లు ప్రాణము, గనఁజాలక కాదె నిలువుగన్నులుపడియెన్.

---

*చిరసంబున—మూ.

క. పున్నమనాఁటినిశాపతి, కన్నియ నెమ్మోముసాటి గనలేక కదా
సన్న మగుఁ దజ్జయంబున, మిన్నాఫాలంబు గాంచు మెఱుఁగులబలిమిన్.

ఉ. తమ్ములమేలు పూనమిని దక్కులవెన్నెల మేనుసోఁకిన
న్నెమ్మివహింపమిం గలుగునింద తొలంగఁగ నిందుఁజందురుం
డెమ్మెలతమ్మియుం జెలువయింపుల నెమ్మొగ మాముఁ బూనెఁ గా
తమ్ములమేలు మేల్సొగసుఁ దాలుచు లేనగు తేటవెన్నెలన్.

గీ. సవతు గనఁడయ్యెఁ బూర్ణదోషాకరుండు
బహుబుణగ్రస్తజలజముల్ ప్రతియుకావు
పరిహృతాశేషదోషమై భవ్యకాంతి
వైభవము గాంచు నెచ్చెలివదనమునకు.

క. ఎన్నఁ బ్రతిబింబభావా, పన్నం బగు ముకురమునకుఁ బోటిలు నేలా
*గన్నన్న స్వమత బింబత, గొన్న వికర్తనతనూజగానబు మొగముతోన్.

గీ. కాంతివారాశి యగుభానుకన్యమోము
జిగి యొకించుక యప్పగాఁ జెంది యొక్క
రేయి చెలువొంది యది దీర్పలేమిఁ బోడము
పాపమా కళంకమై విధుఁ బాయకుండు.

గీ. బహుళపక్షపాతభావితుఁ డైనట్టి, చందమామ జడుఁడు సాటి యగునె
సమతఁబూని శాస్త్రసర్వస్వవిదురత, వఱలుచుండు చెల్వ వక్త్రమునకు.

చ. పగలిది రేయి సొక మఱి పక్షవిభేదము గాంచ కెప్పుడుం
దగులు మహాహ్లాదయస్ఫురణఁ దార్కొను నక్కనికార్మిపట్టి మే
ల్సొగసుల నెమ్మొగంబునకుఁ జొప్పడునే సరి యంచుఁ బల్కఁగాఁ
డొగచెలికాని దోషములు దూఁకొనుపోనిఁ గళంకభావితున్.

క. కనఁజనియె ముకుర మిందుఁడు, కొనవ్యంజనియె మాఱుకొన్నంజనియెన్
వనజంబు గాని నెచ్చెలి, గొనబుల నెమ్మోము సాటి గొన విజ్ఞగతిన్.

గీ. అమరు బింబానుబింబైక్య మరసిచూడ, నరుమబింబానుబింబులకైక్యవృత్తి
కంబుకంధరముఖదర్పణంబుతోడ, నైక్యమొనగూడెఁ జంద్రున కబ్బురంబు.

ఉ. సాటికి రాని నీలములు సోనల రాపడెఁ బొఱుఁబోతులై
తేఁటులు పోయె మేఘములు దీనత మొఱ్ఱలు (వెట్టెఁ) జామరల్
గాటపుఁ డెల్లఁబొ టొంద వెఁ గన్పడెఁ బల్వగఁ గేకిఫించముల్
పాటలగంధికొప్పుసిరి ప్రాభవ మెన్నఁ దరంబె చూడఁగన్.

---

*గంగన్న సమతబింబత — పా.

గీ. అఖిలసుమనఃకదంబకాభ్యర్హితంబు, నీరజాప్తతనూభవనీలకబరి
దానిసవతంచు నేగతిఁ బూనవచ్చు, జగముకై నీరములు మోయుజలవహంబు.

క. అమరెడుకీల్జడ స్రగ్ధర, కొమపసుమిగులు పిఱుఁదు దలఁప గొనబగువిపులే
కమనీయతనువు చపలే, రమణీమణి యాకార వృత్తరత్నాకరమే.

క. చెలమా సుధ కధరము చం,చలమా కనుదోయి కుచము చాలితకనకా
చలమా వైపుల్యజితా, చలమా జఘనంబు ఘనము చానకు నెన్నన్.

క. రాకాచంద్రుని నగు నా, రా*కాంత మొగమ్ము కెంపు రాకావికి మే
రా కామినియధరము చిగు, రాకా పాదంబు సురుచిరాకారమునన్.

క. †నాకము నగుఁ గా నన్మై, నాకము(జిగి)గుబ్బ యలపినాకము బొమ యా
లోకముల సుదతి హరిణా, లోకము నిందించు నౌర లోకము మెచ్చన్.

క. ధరమా కుచ మాబలుఘణ, ధరమా నూఁగారు ‡నీరదాయకధారా
ధరమా కచంబు స్వర్ణవి, ధరమాధరమా మెఱుంగు ధరణిజఘనకున్.

సీ. ఇంపారుకీల్జడ యింద్రనీలముఁ జేయు మధురంపుమోము పద్మంబుఁ జేయు
ముత్యాలసరిఁ జేయు ముద్దురదశ్రేణి రుచిరంపుమోవి విద్రుమముఁ జేయు
శంఖంబుఁ జేయును జక్కనికంధర గుబ్బలు బంగారుకొండఁ జేయు
భూమిచక్రముఁ జేయుఁ బొంకైన జఘనంబు తనరుమధ్యమ్మనంతంబుఁ జేయుఁ
గలికిపాదంబు పద్మరాగంబుఁ జేయుఁ, జాననిలువెల్లఁ దప్తకాంచనముఁ జేయు
వెలఁదిఁ గొనియాడు మాటలు వేయు నేల, రమణిలావణ్య మొగిసముద్రంబుఁ జేయు

సీ. జలధరమాలిక జగజంపుకీల్జడ చంపకమాలిక సరసనాస
భ్రమరవిలసితంబు కొమరారుకనుదోయి మత్తకోకిల యగుమంజుగళము
శిఖరిణి మైమించుఁ జెలువౌ రదశ్రేణి స్రగ్ధరయగు గుబ్బచన్నుదోయి
యమరువిద్యున్మాల యగును దనూయష్టి మత్తేభగతియగు మంజుపదము
అలభుజంగప్రయాతమై యారు దనరు, బంధురంబయ్యె సర్వాంగభవ్యలక్ష్మి
యరసిచూడంగఁ బంకేరుహాప్తసూతి, విశదలావణ్యమహిమసద్వృత్తమయ్యె

సీ. రమణిలావణ్యంబురాశిలోఁ గనుపట్టుఁ దేఁటులగుంపులు డెలివిమీలు
మువ్వన్నెచందురుల్ మద్దులమీనము లుష్మిరము ల్సంపెంగ సొంపునింపు
ముక్తాఫలశ్రేణి మురువంపుఁబవడంబు శంఖంబు గుబ్బలు ల్సరసనాళ
లందంపుఁజిగురులు పొందైనజలనీలి బలువైనహ్రదము నిబ్బరపుదీవు

---

* కాద్య మొగము — మూ. † నాకమనగాకా — మూ.
‡ నీలధూమకధారాధరము — మూ.

లబ్బురపువలపులీనెడునట్టిరంభ, లరిదిగావించు కూర్మంబు లధికమృదుల
పంకజాతంబు లసమానభాసమాన,కాంచనచ్ఛాయ నెపు*డొందవించుతీవె.

వ. ఇట్లు నిండుజవ్వనంబున దేవాసురమనుష్యలోకకాంతామరావకామనీయ-
కలక్ష్మీలీలాయతనంబును సర్వలక్షణైకలక్ష్యంబు నగునమ్మోహనాంగినిఖి
లవిద్యావిజ్ఞానవిమలాంతఃకరణ యని విశేషించి సకలజనపరమాహ్లాదైక
కారణం బగుసంగీతశాస్త్రంబున మిగులఁ బ్రవీణ యగుట యారసి యారసి
కనీలవేణీముఖ సఖీజనంబులు తద్విద్యాపాటవంబుఁ దలిదండ్రులగు ఛా
యాసూర్యులకు డెందంబుల కమందానందంబుగాఁ దెలుపం దలంచి యొ
క్కనాఁడు.

సీ. మేటిమిన్నేటిపొన్నీట మజ్జనమార్చి చిన్నివెన్నెలవన్నెచీరఁ గట్టి
పొంగుసిబ్బెపుఁజన్నుబొంగరంబులమీఁదసొగసుగ్రొంబట్టుకంచుకముదొడిగి
నెఱికప్పుసిరి నొప్పు నెఱికొప్పు చెలువంద నందంపుఁబూదండ లమరఁజుట్టి
రిక్కరామొక్కపెన్నిక్క చక్కఁగఁజేసి చొక్కునెన్నుదుటఁ జేర్చుక్కఁబెట్టి
కలువగమి కెగ్గుగలిగించుకన్నుఁగవకుఁ,గలికి కటి†నిగ్గుమిన్కుల కాటుకయిడి
యలరు నాణిముత్తెపుసరులటుత నిలిపి,తీర్చి రీతి వెలఁదికిఁ గూర్చుచెలులు.

క. కాయమ్మున నాభరణని, ‡కాయమ్ము సఖీజనంబు ఘటియించుచనుఁగ
మాయమ్మే సాటియగు,న్నాయమ్మకు మిగులు సవతు మాయమ్మనుచున్

వ. తదనంతరంబ.

క. ఏచ్చెయిము నీవిద్యకు, నచ్చెరువడి నేఁడు సత్సభాన్వితుఁ డగుచు
న్వచ్చురివేలుపు పిలిచెను, ముచ్చటగా నీదుపాట ముదిపముచూడన్.

వ. అని విన్నవించిన.

ఉ. వచ్చె సఖీప్రయత్నమున వారిజలోచన వెన్క ముందటన్
హెచ్చు కచాదిభారమున నెమ్మెలుకొ నొగిఁగుల్కఁ గొప్పడా
లొచ్చెము లేనిచీఁకటుల నుప్పతిల న్వడి జెళ్కు మోముఁనం
దచ్చపుమొల్కనవ్వు జిగి నందపువెన్నెలచాయ లొల్కఁగన్.

ఉ. కాంచెను గాంచనాంగి దనుఁగాంచినదక్షు సమస్తవిష్టపో
దంచితచక్షు నాశ్రితజనావనదక్షిణనిస్ఫురత్కృపా

---

*డొడివించితీవె—మూ. †కరెనిగ్గ—మూ.

‡కాయంపున్మణిసఖీజనంబు సంఘటియించెన్—మూ.

సంచితవీక్షుఁ బ్రాగ్వచనసారతనూరుచిదుర్నిరీక్షు నా
కుంచితసద్వపుస్త్రితయగోపనపక్షు హతాసపక్షునిన్.

చ. కని కరమొప్ప మ్రొక్కినను గన్నియ నాదరణానువృత్తితోఁ
గనుఁగొని తన్మనోజ్ఞముఖకంజము రంజిల సత్కరంబుల
న్నినుఁడు కవుంగిలించుకొని యింపుగ మూర్కొని తచ్ఛిరోజము
ల్పనుపడదువ్వి చిట్లను నపారకృపారసవార్ధిఁ దేలుచున్.

సీ. పవడంపుఁదీవె రా బంగారుబొమ్మరా పొదలెడురాయంచబోద రావె
గుణరత్నరాశి రా గొనబుఁబూబంతి రా కొమరొప్పుముద్దులగుమ్మ రావె
యతివమేల్బంతిరా యందాలకుప్ప రా యొఱపైనక్రొక్కారుమెఱుప రావె
యప్పచ్చికొండ రా యతనువాలమ్మ రా సొగసైన చందురుసోగ రావె
ప్రాతిమైనట్టి నాతపఃఫలమ రావె, లలితమైనట్టినవకల్పలతిక రావె
రాణగాంచిననాయింటిలక్ష్మి రావె,తలఁపులోనగూర్చు నను(గన్నతల్లి రావె.

ఉ. బంగరు లీనుచూపు గలబంగరుబోటికి సాటియైన మా
బంగరుకొండ వచ్చెఁ గులపావనసద్గుణవార్ధి వచ్చె నా
కొంగుపసిండి వచ్చె మదిఁ గోరినభాగ్యము వచ్చె వచ్చె మా
ముంగిటికామధేను వని ముచ్చట దీరఁగఁ బల్కి వెండియున్.

క. తల్లివి గద కన్యామ, తల్లివిగద సొగసుఁగులుకుఁదనముల సిరిమే
ల్తల్లివి గద సురభూరుహ, వల్లివి గద మమ్ముఁ బ్రోవ వల్లినిభాంగీ.

క. ఒప్పులకుప్ప నినుఁగ, న్నప్పటినుండియుఁ బ్రమోద మనుజలరాశిం
దప్పక మునుంగు నాకుం, జొప్పడె నభ్యుదయ మెన్నఁ జోద్యము జగతిన్.

గీ. అమ్మ నినువంటిపట్టి మాకబ్బెఁ గాన, చాయచాయకు మర్యాద

—(ఇక్కడఁ గొంత గ్రంథము లేదు)—

దముల్చాలఁ దనర
గేయవాక్కర్త్రి యనుపేరు గీలుకొనఁగ, వీణ వాయించె నవ్వేళ నేణనయన.

గీ. †తత్పదముభాతి మంగళార్థంబు గీతి, కది పరాత్మవచించుట నంచు నెన్న
శాస్త్ర మాగీత మగ్గీతశాస్త్రవేత్రి, కబ్రమే భావిసన్మంగళార్థమగుట.

క. రూపవతి గీతిభూషణ, దీపితమై మెచ్చుగాంచుఁ దీవ్రం బుపమా
క్షేపములు వడయునని సభ, నాపాదించుచును మోదమందిరి విబుధుల్.

---

*వృత్తితో—మూ. †తత్పంబాతి—మూ.

ఉ. చాయలు వేయు గల్గునెఱసామికిఁ జాయలు వేయి రెక్కరో
చాయలచాయ జెం      సాతపత్రన్ ఘటిల్లె మే
ల్చాయల కెన్న మిక్కుటపుఁజాయఁ బ్రవర్తిలె ముద్దులాఁడి యా
చాయకుమారిగీతి (గనె) సంగతశీతలమాధురీస్ఫురత్.

వ. అయ్యవసరంబున విశ్వంభరాసర్వభారాయమాణ దుర్మానకంసాదినృశంసదు(ష్టసర్పగారుడ)మణి యగుశ్రీకృష్ణదేవకపటయాదవశిరోమణి ముఖచంద్రబింబరుక్చంద్రికాడంబరంబున నిజనయనజీవంజీవంబులకు సంజీవనం బపేక్షించి విరించిపథావధి యగుద్వారవతీపథంబు నాత్మశరణపూతచరణ(సరోరుహ) విన్యాసంబున ధన్యమూర్ధన్యంబుగాఁ గటాక్షించి తత్కటాక్షసమాక్షిప్తగౌరవ పరభాగసందానితమహాభాగవతద్విగుణితహరినామానుసంధానబంధురరోమహర్షాస్రకంచుకసముదంచితసర్వాంగనయును నందామృతధారాప్రవాహంబున నపగతమోహాదిదోషపంకాంతరితతాలఘూకృతంబు నణుపరిమాణంబు నంతఃకరణంబు దేలియాడ మగిడి సత్యలోకంబు స్వాలోకవిషయంబు చేయం దలంచిన (జగ)దంపుకూటిజడదారి గ్రహరాజగృహరాజంబు సమీపంబున సమీచీనతాసద్రీచీనతదనూనవీణాగానామృతంబు కర్ణకూపంబులనిండారనబ్బురపడి చేపడినవీణియవదలి కదలక మైమఱచి పరచితహ (?)ంబునం దె(న)నిమందపడి (?) డెందంబు వసంబుగాక మసల మెల్లమెల్లనందెచ్చి కూర్చుండి శిరంబుఁ గంపంబుతోఁ గూర్చి తర్జని నాసికం జేర్చి తనలో నిట్లని వితర్కించె.

ఉ. ఎక్కడిలోకమేఁ గనని దెక్కడిగానము (నాకుఁ గ్రొత్తగాఁ
దక్కిన)దిట్టిగాన మొకతావున నైన వినంగ మృగ్యమ
మ్మక్కయి దెంతచోద్య మహహా ననుఁ జొక్కఁగఁజేసె నద్దిరా
యక్కమలాక్షుకీర్తనమునందును డెందము డిందకుండెడిన్.

క. ఔరా మును వింటిఁ బయిఁ, బారావారజకు సాటి(పద్మాక్షి కుమా)
రీరత్న మయ్యె సూర్యన, కారూఢిగుణాఢ్య * నీలయతులాంశం బై.

క. అక్కన్య సకలవిద్యల, దిక్కులఁ దనసాటిలేక దీపించును బెం
పెక్కు మిగుల గీతములన్, లెక్కింపఁగరాను మాధురీగుణ మనుచున్.

క. ఆతరుణి యిప్పుడు తండ్రికిఁ, జేతం (బిగురొత్త సేవసే)యఁగఁ బోలుం
బ్రీతిగ నిచ్చెలిఁ గనుఁగొన, కౌతుకఁ జన నాకు డెంద మెనయ దటంచున్.

---

* నీలయతులాం—యూ.

వ. ఇట్లుహించి.

సీ. సంగతతత్పురుషపదనిష్ఠాస్ఫూర్తి నలరారుపాణినీయం బనంగ
సిద్ధసాధ్యవిశేషబుద్ధస్వరూపతఁ బ్రాకృతవ్యాకృత (ప్రక్రియనఁగ)
జ్ఞాతాత్మరీతి నిర్ధూతాంజనాత్మత సాధ్వలంకృతివిశేషం బనంగ
సరళస్థిరకళాప్రశస్తిసద్భావత సరసాంధ్రశబ్దశాసన మసంగ
నరుగుదెంచెను నారాయణాభిధాయ, కాష్టవర్ణమనూత్తంసకాభిధాన
చతు స్వరస్వరవిశేష, హరిమహతికరుండు శుభాకరుండు.

సీ. చంద్రోపరి సితాభజలవాహరేఖనాఁ దగుఫాలగోపిచందనము దనర
నైరావతాలింగితాభ్రభాపగాబ్జలతాలినాఁ బసిఁడిజంద్యములు మెఱయ
సగ్రకాశ్మీరకింజల్క సముదయం బన జటాసమితి వెలుఁగఁ
గలధౌతనగమధ్యగతనీలవేదిక నాఁ గటిఁ గృష్ణాజినము దనర్పఁ
గల్పకస్కంధపరిణద్ధఘనలతమాల, వల్లి యన వీణ భుజమున వన్నెమీఱ
నలుదిశల మేను తెఱపి వెన్నెలలుగాయ, వచ్చె నారదుఁ డవ్విభావసునికడకు.

ఉ. దూరమునుండి రా మునికిఁ దూర్ణము బంగరుగద్దె డిగ్గి బ
ల్గారవ మొప్పఁగా నెదురుగాఁ జని భక్తిభయాంచితంబు ల
వ్వారిగ సందడించుమది వారిజబంధుఁడు సాఁగి మ్రొక్కెఁ ద
చ్చారుపదాంబుజాతములు సాధుకరద్యుతు లంటి రాజిలన్.

క. మ్రొక్కినఁ *జెయ్యులసాకిరి, మక్కువఁ గైగ్రుచ్చి యెత్తి మది ముదమలరన్
అక్కలహాశనమునినగు, మొక్కలుచొక్కటముగాఁగ మొగమున నమరన్.

క. దీవించె నీకు దుర్లభ, మేవస్తువు లేదు దేవ నిడకుండఁగరా
దేవస్తు వక్షయం బగు, నావస్తువు నీకుఁ జుట్ట మగు నిజ మనుచున్.

వ. ఇట్లు భావిశుభంబుఁ దెలుపు పలుకు వలుకు తొలిపలుకులగమికానిగాదిలి
కొడుకుం గడగనని వేమక గడలుకొన ముందట నిడుకొని వచ్చి యచ్చె
రువులకు నెలవగు తననెలవునకుం దెచ్చి దచ్చిదిక్కు లచ్చంపుఁ బచ్చివె
న్నెలలు సొగసు మసుంగు లోసంగు మగటామానికంబుల పెద్దగద్దియ
నుంచి యవంచితభయభక్తి వినయాతిశయ మ్మగునాశయమ్మున నమ్మహాశ
యునకు నిర్విశేషమ్ముగా నిజకరకుశేశయమ్మున సదాశయోచితంబు లగు
నుపచారంబులు చేసి యాబేసిగుట్టుఁబులతేటనెఱదోర దొర సెఱుంగని

* జైవ్రులసామికి. మూ.

కొప్పులకుప్పం దనకూఁతుం బిలిచి యప్పా యిప్పాపరహితునకు మ్రొక్కం
జక్కంబడని దొక్కటియుఁ జిక్కదు మ్రొక్కవలయు నని మ్రొక్కించిన
నక్కారుణికపురుషమణి పురుషశిరోమణిపాణిగృహీతివి గమ్ము పొమ్మా
యని దీవించి యనుపం బిదపఁ దదనుమతి నమ్మహామతి నిజానుగతసభా
జనంబుల యథాపూర్వోచితస్థానంబుల వసియింప నియమించి తాను
దత్సమీపతలంబున దివ్యభవ్యనవ్యహేమముక్తాఫలాముక్త నిర్ఛిద్రభద్రాస
నంబునఁ గూర్చుండి యుండెఁ దత్కాలంబున.

చ. *తొలుతటిపల్కుబల్లనులు దుష్టతమోహరణప్రవీణమాం
సలమహిమాన్వితు ల్మహితసత్పథవృత్తినిరూఢభావు లా
కలితదిగంతరాళరుచిగాఢతనూరుచిరుల్ సభాస్థలిం
జెలువలరారి రిద్ధఱును జేతనజాతము లబ్బురంపడన్.

క. అన్యోన్యకాంతివైభవ, మన్యోన్యముఁ గప్పఁ జిహ్నలవిషయములుగా
నన్యనియం దన్యభ్రమ, మన్యాయత్తంబుగాక యలవడె సభకున్.

క. నిండునెలఁబోలు మునిమా, ర్తాండుని మార్తాండుఁ జూచి హరికైదువుపే
రుండెడుపులుఁగులు భ్రమచే,నొండొండ ముదంబు ఖేద మొందునుమిగులన్

గీ. అట్టియెడఁ దమ్మివిడిమట్టుపట్టుదిట్ట, పట్టి యగుమౌని కనియె నవ్వొట్టజేజె
గీటుకొనుహాసమున మోముసీటుగుల్క, మాటమాటకునమృతంబు తేటలొలుక.

క. నీరాక రాక సమ్మద, నీరాకరమునకు సుగుణనీరాకర యీ
నీరాక గాక యా(ప, న్నీరా)కరమునకుఁ దేవ నేనెఱుఁగుదునే.

వ. ఓసుదర్శనకరశుభకరపదభక్తిమత్సుదర్శన నిదర్శనసమధిగత నిఖిలదర్శన
కాలత్రితయపవిత్రతావ్యంగ్యవ్యంజకంబగుభవదీయదర్శనసమంజససంజీవ
నౌషధంబున మదీయతాపత్రయంబపత్రపానిఁ యంబయ్యెడు మజ్జననంబు
పరార్థభావంబు నొందెడు మత్తేజంబు వేలోల్లంఘనంబుననలరారెడు మద
భ్యుదయం బనస్తమయంబై చెలువారెడు మదీయనివాసంబు విష్ణుపదంబు
నం జెన్నుగాంచెడు మదధికారంబు గ్రహాతీతం బైయొప్పారెడు మచ్ఛత్రం
బు కాంతిపర్యాయంబై వెలుంగొందెడు మత్సంతానంబు సమందతఁ గాంచి
యు నమందత దైవారెడు నీరేడుజగంబులఁ దేజోవంతులకు దృష్టాంతంబనై
మెలంగెడు భాగ్యంబు నాకుఁ బొసంగెడు సమాధిమత్కళానిధినిరుపాధి

---

*తొలుతటిబలుకు-బల్కి-సుచుఃమూ.

కకృపాపయోధి వగు నీ మసన్నిధికి గమనంబు గమకంబగు మత్పూర్వతనా గణ్యపుణ్యపరిపాకంబ యని యరసి నిర్ణయించుకొని మొదల నధిగతపరమార్థతకు నవాప్తసర్వకామతకుం గేవలపదంబైన భవాదృశులకు మాదృశరాజసజనంబు ననుసరించి యత్కించిదర్ఘప్రదానంబునకు సంప్రదానత గొనుట గగనకుసుమంబు గనుటయె సిద్ధంబని సిద్ధాంతీకరించెదవంగా దేని దేవరచిత్తంబు కుతుకలీలాయత్తంబై యదర్థంబు విషయీకరించి సర్వార్థమూర్ధాభిషిక్తంబు సేయ నవధరించె దదర్థంబు భవత్సన్నిధానవైభవసమాసాదితసంపత్సాకల్యకల్యతం దగు భవజ్జనుసవిధంబున నస్తిత్వఖ్యాతంబు సంయోగంబు గొని కారకత్వం బంగీకరించు నని నిస్సంశయంబుగా సంకల్పించెద భవాదృశుస్వదృక్పారతంత్ర్యంబునం బ్రవర్తిల్లు నద్దోవందారునకు నెందేని స్వాతంత్ర్యం బతంత్రం బగుట చిత్తగించి వాచావిషయత తత్ప్రకాశక్రియం బ్రసరింపం జేయ దయసేయవలయు నని పునఃపునారచితప్రణామంబులం బ్రార్థించిన.

గీ. ఇట్లు* వేపాదములసామి యింపునింపు, మధురభాషలభాషింపమౌనివినుచు
హరికథాసుధయానినయపుడు గాంచు, మోద మందుచు నత్తమోభేదికనియె.

ఉ. ఓయి సమస్తలోకనిచయోదయహేతునిజప్రకాశ భ
వ్యాయతకీర్తి నీకు నిటు లాడంగం జెల్లునె యన్యునట్లు నీ
వాయతనంబవైతివి చరాచరసంజననావనక్రియా
పాయనిదానమూర్తులకు భద్రకరాగమరూపవైభవా.

క. మిన్నా దేవత యనుచు, న్నిన్ను నుతింపం బనేమి నిగమావళులం
గన్నట్టి త్రిపదయే నిను, సన్నుతి గావించుకొనుచు సార్థక మయ్యెన్.

క. వెన్నునిం గన్నులం జూచుట, నిన్నుం గనుంగొనుట మాకు నిజ మొక్కటియే
యన్నలినాక్షుం గనుంగొని, నిన్నుం గనవచ్చినాండ నీరజమిత్రా.

క. ఇంకొక్కటిం జెప్పెద నే, వంక న్వీన నరిది గాన వైఖరిచే నీ
పొంకపుం గూంతురు నను నీ, వంకకు రప్పించెం జుమ్ము వనజాతసఖా.

క. నీలాలక యిది నీలా, లీలావతియంశ నవతరించిన దగుటన్
నీలాపతికా ద్రోక్కెడు, †లీలాయదుమౌళి ముద్దులేమం బ్రేమన్.

క. ఈరీతిం బల్కు వీణా, పారీణయతీంద్రువచనబంధమధురిమా
సారములు చెవులు సోంకిన, బౌరాకారములసామి పలికెం బ్రీతిన్.

---

* వేయుపాయములసామి మూ. † లీలాయమౌళి-మూ.

చ. హరిపదపంకజాతయుగళాంచితభక్తిపరప్రవేక యా
హరి మనుజాకృతిం బుడమి నందుటకుం గత మెద్ది యమ్మహా
పురుషునిఁ జెందఁజేయఁ దగుపుణ్యపుసాధన మెద్ది రూప మ
ప్పురమున కెట్టి దింతయు నపారకృపాజలరాశి తెల్పవే.

క. అన విని వీణాముని య,య్యనునిఁ గనుంగొనుచు నగుచు నిట్లను సౌరా
వనజాప్త నీదువినయము, విని కని యెఱుఁగము సమస్తవిబుధులలోనన్.

గీ. వేదమూర్తివి నీవె కా వేదవేద్య, నెఱుఁగఁజాలవె యెట్టిన నెన్ని చూడఁ
బరహితజ్ఞానమార్గప్రవర్తకులకుఁ, బ్రష్టృభావంబు భూషణప్రవర మనఘ.

క. వనజాక్షుభక్తిభరపా, వనుఁడవు నీవెంతభాగ్యవంతుఁడవు బళీ
నినునుండి తత్కథాస్మృతి, నెనసితి *నిటనాదుపుణ్య మే మనవచ్చున్.

క. దిన మొక్కనిముస మయిన, న్వనజాక్షుస్మరణ మెలఁగ వానివృజిన మ
ద్దినకృతము సుకృతమగు స్ప, ర్శనవేధిస్పర్శ నినుము సౌవర్ణమె కా.

చ. తలఁచిన విన్న మానసము తద్దముసుంగు ముదంబురాశి నెం
బులక †లెసంగుఁ గన్నులఁ బ్రమోదజలంబులు పొంగుఁ బూర్ణతా
ఫలితమనస్కులౌ పరమపావనమానుల కైన నద్దిరా
బళిబళి వాసుదేవుకథఁ బొటిలుమాధురిసార మెట్టిదో.

సీ. సౌశబ్దసంగతి సడలుకావ్యమురీతి విజ్ఞానహీన మా విద్యమాడ్కి
సాధుదానము ‡లేనిసంపద కైవడి వరశాంతి నెడయు తపంబుభాతి
కంఠరక్తమానుగానంబువడుపునఁ బాలనసేయని ప్రభుతచాయ
శ్రద్ధానురుద్ధత జాఱుకర్మము క్రియ రాగంబు గాంచని రతిపరుసున
సిద్ధపాండిత్యవర్జితసేవ§ లేవ, భూరిపరిమళ మందనిపువ్వుపోల్కి
వాసుదేవునిపదభక్తి వదలువాని, జన్మము నిరర్థకం బగు జలజమిత్ర.

చ. అలపరతత్త్వ మెంతటిమహాత్మునికైనఁ దరంబుగాదు దాఁ
దెలియఁగ నెట్టిదిట్టలను దెల్పికిరాఁ దెలుపంగ శక్యమే
జలరుహమిత్ర యట్లయిన సంగ్రహసూక్తుల నాదుబుద్ధికిం
దెలిసినయంత దెల్పెద సుధీవర తప్పక యాలకింపుమీ.

---

*నిచనాడుపుణ్యా—మా. †లొసంగు—మా. ‡చేయుసంపద—మా. §ద్రేవ—మా.

గీ. ఈప్రపంచంబునకుఁ దొల్త నెసఁగుచుండు
సచ్చిదానందమయ మాత్మ(సంగ)రహిత
మననుగతరూప మవ్యవహార్య మఖిల
మానసంచారశూన్యంబు భానుమంత.

గీ. అప్పరంబు సిసృక్షచే నమరి త్రిగుణ,మాయఁ గైకొని సగుణత మఱగి సర్వ
కారణవిచిత్రకార్యసంఘాతరూప, మగుచు నారాయణాఖ్యత నలరుచుండు

సీ. తత్స్వరూపావాప్తి దనరు జ్ఞానంబున జ్ఞానంబు భక్తిచే సంభవించు
వేదాంతవిద్యచే వెలయును సద్భక్తి యవ్విద్య గురుసేవ నందవలయు
సద్గురుసేవ నిష్కామత్వమున నబ్బు నది చిత్తశుద్ధిచే నమరు నద్ది
కాలుష్య మణఁగినఁ గలుగుఁ దద్రాహిత్య మలవడుఁ బాపక్షయంబు గాఁగ
నట్టిపాపక్షయంబు మే లానవచ్చు,దాన యాగాదిసత్క్రియ లూనఁ గలుగు
నవియుఁ దన్నాశకరశక్తి దవులుటరిది, కర్తనిష్కామమానసుఁ గాంచకున్న

క. భక్తియె స్వతంత్రకరణము,ముక్తికి నని కొంద ఱండ్రు భూరివివేకుల్
*భక్తిసుసాధ్యజ్ఞానమె, ముక్తిద మని కొంద ఱండ్రు భూరివివేకుల్.

గీ. అఖిల మాత్మేష్టదేవత యనెడుబుద్ధి,నిరతిశయభక్తి బ్రహ్మమె పరఁగు నంత
యనుమనీషయ జ్ఞానంబునగునుగాన,జ్ఞానభక్తులకైక్యనిశ్చయము మాకు.

గీ.కమలబాంధవజ్ఞానయోగమ్ముభక్తి, యోగమన రెండుబలునావలొప్పుచుండు
ఘోరసంసారవారిధిపారమంద,ననుచుమునికృతులొకకొన్నియమరఁబలుకు.

గీ. అరయ శ్రవణాదికక్రమాయత్తమవును, జ్ఞానయోగమ్ము తదితరజ్ఞానవిభవ
ఘటకమవుచుండు భక్తియోగం బనంగ,భావమీగతిఁ బలుకు నిబంధనలకు.

వ. విను మప్పరమేశ్వరుం డగునారాయణుండు లోకరక్షణపరాయణత్వంబు
నం దత్తత్కాలంబుల నానారూపంబులు దాల్చుచుండు నందువిశేషించి.

సీ. ప్రాఁబల్కుగమిఁ దస్మిపట్టితోఁగూర్పంగ జగమంత పృష్ఠదేశమునఁ బూన
ధరణిఁ గొమ్మునఁదాల్ప దనుజుఁగొమ్ము వగుల్ప బలి నధోభువనంపుఁబట్టుసేర్పఁ
గృతవీర్యజాదిభూపతుల విదారింప వనధిమధ్యం బరావణము సేయ
ముష్టికాదులఁద్రుంపఁబురసత్త్వముహరింపయవనసంహార వైభవముగాఁగ
జలచరాకృతిఁ గమఠతఁ జటులకిటిత,నరమృగేంద్రతఁ గుబ్జతఁ బరశుధరత
రాఘవతహాలితబుద్ధతలలితహయత,నఖిలజనములుగొనియాడనతఁడుగొనియె

*భక్తిసాధివజ్ఞానమె — మూ.

గీ. తపన యిత్తఱి నప్పరతత్త్వ మవని, భారకారులఁ గంసాదిఘోరదనుజ
నికరములఁద్రుంపవసుదేవునికిజనించి,వఱలుచునుగృష్ణుఁడనద్వారవతిమెలంగు.

వ. అతనిమాయాబలపరిగృహీతదివ్యమంగళవిగ్రహంబునకు నుపమానంబు దు
ర్గ్రహం బన నసంశయం బేమియయినం గీర్తనధ్యానాదిసాధనంబులం బా
పక్షయార్థు లగుమాదృశు లగుదాసులకుం దదుపమానకల్పనసాహసంబు
న నల్పదోషంబుఁ గాదని విచారించి నాయథాశక్తి నమ్మహాపురుషు నంగ
సౌందర్యం బీషత్కాలంబు గీర్తించి కృతార్థత గాంచెద సావధానుండవై
యవధరింపుము.

సీ. ఇంద్రనీలచ్ఛాయ నెనయు దేహమువాఁడు ముద్దుగుల్కెడునవ్వు మోమువాఁడు
ఘనశంఖనిభ మైనకంఠంబు గలవాఁడు చక్కని వెడఁదవక్షంబువాఁడు
జయలక్ష్మి లీనునాజానుబాహులవాఁడు దనరారు సింహమధ్యంబువాఁడు
జవసంపదల మించుజంఘలు గలవాఁడు తమ్ముల మించుపాదములవాఁడు
కటిని జెన్నొందు బంగారుపటమువాఁడు,ధాతఁ గన్నట్టినాభిపద్మమ్మువాఁడు
ప్రబలు శ్రీవత్సకౌస్తుభప్రభలవాఁడు,చక్కఁదనముల *కిల్లైజరుగువాఁడు

ఉ. క్రిందయి రేకమోచి పరిఖిన్నతఁ గృష్ణునిపాదయుగ్మ మిం
పొంద భజించి యంబుజము లొక్కెడఁ దత్సుషమాంశలేశకా
ప్తిం †దనరారఁ బద్మములపే రది వోనిడి తత్సమంబుగాఁ
గొందురు పాదపద్మ మని కుంఠితబుద్ధులు గారె లోకముల్.

ఉ. అంగుళులే దళంబులు నఖాళులు కేసరము ల్పదప్రపీ
ఠాంగణనమ్రదేవమకుటాంచితనీలమణీరుచు ల్చల
ద్భృంగములై చెలంగఁ గడుఁ దేజిలుశౌరిపదాబ్జముల్ శుభా
ళిం గరుణించి భక్తులకు లేములు వాపుఁ దమోనివారకా.

ఉ. అంగజుమేల్మిపంగయుగ మాకృతి కేము సమానవైభవం
బుం గయికొంటి మింక సరిపోలము కాంతి నటంచు నల్లులం
‡బృంగి తపించి తత్తనువు వీడిన నాదొన లీడుగా వన
న్నంగతి నయ్యదూద్వహునిజంఘలసొంపుఁ దలంప శక్యమే.

చ. తన కుపమానవస్తు వికఁ ధారుణి లేదని కాచె గెల్పుపెం
పున ధరియించు మేల్చిరుదు §పో యిదినాఁగ మణీవినూత్నకాం
చనమయనూపురార్భటి నెసంగెడుఁ దద్ఘనజంఘ లెంచ న
వ్వనజభవుండుఁ జాలఁడు దివాకరతత్ప్రభ నెన్న శక్యమే.

---

*ఇల్లై-మూ. †దనరారిపద్మములు-మూ. ‡బ్రుంగి— అని యుండుట న్యాయమైనను గొన్ని ప్రాచీనప్రయోగము లిట్లు కనఁబడుచున్నవి. బ్రుంగి... బోవిడి-అనుట సరళపద్ధతి. § మేల్చిరదపో రెసెద-మూ.

చ. ఊడుగనిడాలు మీఱు హరియూరులతీరిక మేటిసాటికిం
గడఁగి సమంబుగా కనఁటికంబములుం బొరవిచ్చి పోయెఁ బ
ల్విడిసెడి దానఁ జేసి "కదలీ న కదాచన" యన్నిషేధ మె
క్కుడు వడి నిల్చెఁ గాదె తమకుఁ జగతీస్థలియందు భాస్కరా.

గీ. విద్యుదావృత ముద్ధురవృత్తిశోభి, దీర్ఘఘంటానురణనసందీప్తిరత్న
పదలసద్గుణలలితశోభామిళితము, పద్మదళనేత్రు నుత్కటిబంధ మమరు.

క. ఘన మగునేని జడంబగుఁ, దనయాశ్రయ మట్లుగాన స్థైర్యము గొనరా
దని మెఱుఁగుఁదీఁగ హరికటి, ఘన మజడంబనుచుఁ జేలకైపున నిల్చెన్

ఉ. దండినజాండభాండములతండము లుండఁగఁ దత్ప్రచండస
న్మండలియందునుండి గరిమ న్వెడల న్మగుడం జనంగ బల్
గండి యొనర్చిరో యి దనఁగాఁ దనరెన్ హరిదివ్యనాభి *యు
ద్దండత నల్పఁ గన్నవిరి తద్దయు నొప్పు(చునుండ) భాస్కరా.

చ. తనదు విచిత్రశక్తికి నిదర్శనమై తనరారఁగాఁ బ్రవ
ర్తన మృగరాజభద్రగజరాజులఁ గొనున యానరీతియం
దు నలవరించి మించె ననఁ దోఁచును దద్విభుమధ్యయానము
ల్గనుఁగొని యెన్న నచ్చెరు వగున్ హరిసుందరభావ మిద్ధరన్.

చ. కవిబుధచంద్రలోకహితకారకమంగళజీవకేతువై
భవత రిపూత్కరంబు గెడపం గడుఁ గూడిన కాలసర్పయో
గవిధిఁ బ్రకాశమందెడు నఖండ†లసద్భుజదండకాండమై
భవముల నొప్పు మాధవునిఁ బ్రస్తుతిసేయఁ దరంబె భాస్కరా.

చ. అమర ధరాంబరద్వయమునం దెసలారుగుణంబునందు ది
వ్యములు(?)సురారివైరిరశనాకృతి దాలిచెఁ గాని(దా)ననం
తమణిసితాసితార్యగురుధామ వినూతనచంద్రసౌమ్యభా
వము గనఁజాలునే రశనభావము లోనఁ దలంప భాస్కరా.

ఉ. కలికితనాన నోట మిటు గన్పడె నాపను లింకఁ జెల్ల వం
చలవలరాజు చేతినిశితాసియుఁ బల్కయు నాన ముంగిట
న్నిలిపి స్వజన్మదేశమున ‡నిల్చెనునాఁ గనుపట్టు నారును
న్నులుకుటురంబు నల్లయదుకుంజరుఁ డొప్పుఁజుమీ యహర్పతీ.

*యుద్దండమహత్త-మూ. †లమద్భుజ-మూ. ‡నిల్చెననా-మూ.

క. చతురాస్యవదనమారుత,గతిచే వక్షమున కెగసి కనుపడునాభీ
వితతపయోరుహకేసర,వితతి యనం గౌస్తుభంబు వెలయున్ హరికిన్.

క. ఒత్తుటలువడుచు మార్దవ,భృత్తయు *సుస్వనత లేక వెలవెలఁబోచున్
రిత్తవడి శంఖ మచ్యుతు,కుత్తుకనై పోలిచి నిలిచె గుణనిధి యగుచున్.

క. మంజుభుజకీర్తిహీరా, సంజితధనళిమము భూమిసాకల్యధురా
రంజితము కంసదానవ,భంజనుకే లమరు శేషఫణిసన్నిభ మై.

చ. తను వెలగాఁ గొనుం బసిఁడి దాన మెలంగుటఁగాని చెల్వు లే
దని యల కెంపు తద్విభుశయద్వయమై నవరత్నకోటికాం
చనతను †పేయఁ బుచ్చుకొనసాగి విదోషసదోషభావతన్
గొనబు వహించుఁ జూడ్కులకుఁ గోరిక లీరిక లీనుచుండఁగన్.

క. అకలంకగోవిలాస, ప్రకటత దోషానిరుద్ధభావతఁ గొనుచు
న్వికసించు తన్ముఖంబున,కకటా దుష్టములు నెలయు నబ్జము సరియే.

చ. తమిఁ గొను ముద్దుకై తలఁచు తామరసాలయకన్య కన్యకా
భ్రమ జనియింపఁ దచ్చనకుఁ బన్నన నిద్దపుఁదళ్కు మించుట
ద్దములన దోఁచు జూపఱకుఁ దద్దయు మేల్నునుజెక్కు లౌర చి
త్తమునను వాక్కునం దలఁపఁ దత్ప్రభ సన్నుతిసేయ శక్యమే.

క. బలుగండ్లు వోవఁ బవడము, జలజాక్షుని మోవి యయ్యె సాగె నట వధూ
విలసద్రదనక్షతములు,తొలఁగ దెచట బాధ రాగదోషము గొన్నన్.

చ. ఘనవదనాలవాలమునఁ గన్రవచస్సుధ నాటు దేరి చి
న్ని నగవు వెన్నెలం గలసి చిక్కనయప్పవడంపు మోసులో
యన రదనాళి యింపొనరె నాదటఁ దళ్కుసలం బనంగఁ గృ
ష్ణునిమధురాధరంబు గడుసొంపు వహించు నిలింపవందితా.

క. కమలాహితవరకాంతులు, శమితతిమిరజూర్తు లమలసత్పథవర్తుల్
భ్రమితోరుతారకంబులు, కమలాక్షునియంబకములు కడుఁ దనరారున్.

ఉ. భవ్యతరంబుగా భరణభారవలాంచితవృత్తియుక్తమై
నవ్యపయోజజాతయమనం బయి యుత్పలమాలికాకృతి
స్తవ్యము గాంచి రాజిలును దైత్యవిరోధిశుభేక్షణాలి త
ద్దివ్యదుదారవైఖరులు తెల్పఁగ నా కగునే విభాకరా.

---

*స్వుస్వనత-మూ. †పివ్వ-మూ.

క. శివిళ శ్రుతిపదగము లై, భావింప సువర్ణశబ్దభరణాంకము లై
సైవాటి మంగళమహా, శ్రీవృత్తము లగుచుఁ బొలిచె శ్రీపతివీనుల్.

క. హరికప్పుబవిరిగడ్డము, *సౌరిదిగ నవ్వదనచంద్రుఁ జుట్టుకొను దళ
త్సురరాజనీలశోభా,పరిపంథిస్రభలఁ దనరుపరివేష మనన్.

క. హరిచెక్కుల సొంపారెడు,గురుతరనవపద్మరాగకుండలరుచి శ్రీ
తరుణీకృతచుంబనవి,స్ఫురదురుతాంబూలరాగముం దలఁపించున్.

గీ. విషయగంధరాగవిఖ్యాతిచేఁ జెన్నారు, కమలపత్రనేత్రుఘ్రాణమునకు
విషయ మనఁగరాదు వివరింపఁగా గంధ, ఫలిని†గంధమాత్రఫలిత మగుట.

క. గుణవృద్ధు లగుచు రాజిలు,ఫణిరాజశయానుబొమలు పరికించునుగా
గుణిగణము వక్రమే‡యిది,గణుతింపఁగ వక్రతమమెకా‡యిదియనుచున్

క. చక్షుఃప్రియమ్మృగమదతిల, కాక్షీణసులక్షణైకహారి యగ్భరమా
ధ్యక్షునలికంబునకు నప,లక్షణవక్రంపునెల తుల యనం దగునే.

గీ. ప్రథమకైవడి సత్కళాప్రథ వహించు,దీపితాకారమై సంవృతి కెన యగును
శక్యమే సన్నుతికి యదుసార్వభౌము,లాలితచ్ఛాయమ్మృదులనిటాలతలము.

గీ. మహితజలధరమాలికామైత్రిఁగాంచి,వఱలుచుండెడుహరివాలబంధమొప్పు
లఘుగుణౌజ్జ్వల్యముఖ్యాత రాజిలంగఁ,జాల రహిఁజెందుచంపకమాలి కమర.

గీ. అతనిసౌందర్య మతనికళ్యాణగుణము,లనవశేషంబుగా నెన్న నలవిగాదు
వదనములు నాల్గు గల్గినవాని కైనఁ,దలలువేయింట మెలఁగెడుచిలువకైన.

ఉ. అట్టిసమస్తలోకనిధి యట్టిజగద్ధితవేషధూర్వహుం
డట్టిదయాపయోవసతి యట్టితమోపహనామకీర్తనుం
డట్టివిచిత్రరూపఖని యట్టిమహాద్భుతకార్యకర్త నీ
పట్టికి మేలుప ట్టయినపట్టు సుమీ పరికించి చెప్పితిన్.

క. మదిలోపల నిక్కార్యము,వదల ననౌచిత్య మచట వదలదును వదా
వదవదనవనజములు సమ, పదభాషితభూషణంబు పద మందదుగా.

గీ. అబ్జబాంధవ యింతపర్యంత మిట్లు,హరికథాగోష్ఠి సమయ మత్యంతమధుర
మగుచు వెడలెను సత్యలోకానుసరణ,వాంఛ దీర్పంగ నానతీవలయుననిన.

---

*సౌరిదిగనన్వదనచంద్ర- †గంధమాత్రఫలిత-మూ. ‡రెండుతావుల 'యివి' యని యొకటిదు.

గీ. ఇట్లు బలు *పోటునాటలనింపుగాంచు, మించుజడదారిరతనంపు మేలుమాట
లాలకించి ముదంబాత్మఁ జాల నించి, యినుఁడుసద్భక్తిఁబల్కె మెల్లనహసించి.

ఉ. ఆంతర పాతకంబుబలు పాఱుప నేరుపు గల్గె నాకు నే
కాంత మనంత మానుదయ మంది తనంతపదంబు గంటి శ్రీ
కాంతుసుధాతికాంతకథఁ గర్ణయుగం బొగిఁ దన్పి తీవు వా
క్కాంతతనూజ నమ్రజనకల్పకభూజ సుధీజనోత్తమా.

క. ఏకగుణహాని యెఱుఁగని, జోక విశేషోక్తియందు శోభిలు నమృత
శ్రీకలితసామ్యదార్ఢ్యము, లోకహితాచార బోధలులితవికారా.

గీ. అనఘమీరానతిచ్చినయట్లు నడచుఁ, గాక యీజనుఁ డన్యథాగతి మెలఁగు నే
నైదికోక్తికి మీవంటివారిమాట, కరయ సత్యత నీరెంటి కర్థమొకటి.

వ. ఇట్లు వచించి విరించితనయునకు సవినయంబుగా నమస్కరుండు నమస్క
రించి యతం డరుగఁ గొంతద వ్వనుగమించి మగుడఁ దదనుజ్ఞ భరించి తిరిగి
వచ్చి కూఁతుం గాంచి గ్రుచ్చి కౌఁగిలించి మెచ్చుగా ముచ్చట దీర న
మూల్యభూషణాంబరంబులు ధరింపించి తక్కినసీలవేణీముఖసఖీజనంబులకుఁ
దగిన సభాజనంబులు సభాజనదృక్సభాజనంబుగాఁ గావించి యయ్యింతి †మె
లపుటింతులతో నంతిపురంబునకు ననుపుటయు.

క. పరమార్థరూప వినము, ‡చ్చరమార్థవిధానదక్షసంస్మృతనామా
సురమాన్య మాన్యచరితా, పరతరమానీంద్ర హృదయపంకజభృంగా.

గద్యము. ఇది శ్రీమద్రామచంద్ర చరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి
మాధవయజ్వసముజ్జ్వలత్కృపాకటాక్షాసాదితపాండిత్యాభరణ ప్రభంజన
వంశాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవనన్నయ
భట్టారకాహోబల§పత్యాహ్వయకవిమహోపాధ్యాయభట్టారక ప్ర
ణీతం బైనకాళిందీకన్యాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమా
శ్వాసము.

---

*పోటినాటల-మూ † మేలుపుటింతులలో. ‡చరమార్గవిధాన. §బిలపత్యా-మూ.

శ్రీ

# కాళిందీకన్యాపరిణయము.

—: ద్వితీయాశ్వాసము :—

క. శ్రీమైథిలీమనోహర, కామితఫలదాయ సుజనకల్పమహీజా
శ్యామలవిగ్రహ నుతసుత్రామా సాకేతధామ దశరథరామా! ౧

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

క. తనతండ్రికి నారదుఁడా, వనజాక్షునిచరితములను వర్ణింపంగా
విని మనము నాటి కామిని, తనకుం దగినట్టివిభుఁ డతండని తలఁచెన్. ౩

ఉ. ఉల్లము రంజిలం దనుఁ బయోరుహ*నేత్రలు గొల్వవచ్చి తాఁ
దల్లికి మ్రొక్కి యాయమ ముదంబున సేస లొసంగి దీవనల్
తెల్లముగా నొనర్ప నొకతీరునఁ గైకొని యొయ్య నొయ్యనే
పల్లవపాణి యందుఁ దగుబంగరుగద్దియఁ జేరెఁ జాతతోషన్. ౪

చ. వనజభవేంద్రచంద్రధరవాఙ్మనసాతిగ మై వెలుంగు కృ
ష్ణునిలలి సొంపునింపు జిగిసోయగము న్విభవంబునుం ద్రయీ
తనునకు నారదుండు తదుదంతము సాంతముగాఁగఁ జెప్పఁగా
వినిన మెలంత కచ్చువడి వేగమె నిల్పె హృదంబుజంబునన్. ౫

చ. తలఁచినయంతనే మిగుల దర్పకుఁ డేపఁగ నంతకంతకు
న్వలపులు చింత వంత బలవంతపుఁగాఁకలు వింతసేయఁగాఁ
జెలుల కెఱుంగనీక తనచెక్కిటఁ జెయ్యిడ నేరకుండె నా
జలరుహపాణి మాఢ్యమునఁ జెయ్వులు దక్కుచు లోనఁ గుందుచున్. ౬

ఉ. వీనుల విన్నయంతయును వెన్నునిచక్కఁదనంబు సంతత
ధ్యానము సేయుచో నతనియాకృతి కన్నులఁ గట్టినట్లయై
మానుగఁ దోఁచినంతటన మానిని సిగ్గున మోము వాంచినం
గానమి నంతలో వగచి కన్నుల నించును బాష్పపూరముల్. ౭

చ. నెలఁతకు వెంటనే మరుఁడు నెమ్మదికొల్పె వియోగవహ్ని రా
ల్గొలుపను మించఁగా వెడలు క్రొత్తజిగాడ్పున వేఁడియూర్పు బై
ల్దొలఁకెఁ దదుద్గతాభినవధూమఘనాంకురపాళినాఁ బయిం
బులకలు నిండెఁ దద్రసముపోలికఁ గ్రమ్మె శ్రమాంబు చెక్కులన్. ౮

*నేత్రలు-మూ.

చ. తఱుగక నే మెలంగినను దామర*కంటికి మోముదిప్పి కో
నెఱిఁ దొవరంగు పొం గిడెను నీటరి సాటి యటంచుఁ బల్లిఁగా
నుఱియలు లోఁగ వైరి యిఁక నుండఁగ నీతము గాదటంచుఁ దా
నటువలె లయ్యెఁ జెమ్మట నోయారపుఁగస్తురిబొట్టు మోమునన్. ౯

ఉ. క్రమ్మిన చెక్కుక్రొంజెమట గన్రుకరంబులఁ గ్రుమ్ముచున్ గగు
ర్పొమ్మెయి పైఁడిదువ్వలువ మూఁత దలిర్పఁగఁ గోరిక ల్మది
న్మమ్మర మేనియు న్మఱుఁగుఁ బూని త్రపావశత స్వయస్యలం
గొమ్మ యెఱుంగనీక యటు గొంత మెలంగెఁ బ్రమోహమగ్నయై ౧౦

క. ఈగతి విన్నంతనె మను, లాఁగక రేఁపన్ హృదంబుజాస్థపునస్సాం
ధాగరిమన్ గరితకు న్నాలోఁ గనఁబడియెన్ రమేశురూపం బెల్లన్.

ఉ. శౌరియచింత్యరూపపటుసంపద సింగిణి గాఁగఁ దర్శనో
దారత నారిగా హసప్రధానమనోహరసౌమనస్యశృం
గారము లంపకోలలుగఁ గైకొని మన్మథుఁ డేయఁజొచ్చె నే
పార శిరీషపేశలము లైనతలోదరిసుప్రతీకముల్. ౧౨

ఉ. ఈయదుసార్వభౌముకథ లిట్టివి భావభవానుమోదదం
బై యెదఁ బాయకుండె సఖులార సదా యతనుప్రభావమో
హో యని వారువారుఁ బ్రకృతోక్తు లనన్విని ముగ్ధ గావున
న్నా యెడఁ గూర్చి పల్కు టని నాన నతాననయై వసింపుచున్. ౧౩

వ. అంత నగ్గద్దియనుండి ముద్దియ దిగ్గన లేచి. ౧౪

సీ. శుక్తికానిర్ముక్తమౌక్తికంబులరీతిఁ గన్నుల బాష్పాంబుకణము లొలుక
జాలాంతరవిలోలచక్రద్వయములీలఁ జన్గవ పైఁటలోఁ జౌకళింప
ఘనసంఘనిర్గతకరకలకరణిగాఁ దుఱుమున నరవిరు ల్దొరఁగుచుండ
సారసోపరిహిమజలబిందువులపోల్కి మోమునఁ జెమ్మట మొల్లలెత్త
నడుము గడగడ వడఁకఁగ †బెడఁగుగడవ
నుడిగెపుఁబడంతు లుడిగెము లొగిఁ బరాకు
చేయుచును జెల్వకైదండ సేయ నదియు
నిచ్చగింపక యింటికి నేగి యచట. ౧౫

* కంటుక — మూలము. † బెగడు కడువ — మూ.

—: కాళిందివిరహావస్థ :—

క. కసికాటుగ భుజియింపుచు, విసువున నేతెంచి పాన్పు వెసఁ జేరె మనో
రసజాతతీవ్రవిరహాభ,రసుమనస్సహతాప యాచు రమణి రయమునన్. ౧౭

చ. ఎడయనిమోహవేదనల నెంతయుఁ గుందుచుఁ గృష్ణరూప మే
ర్పడ నునులేఁతకల్పతరుపత్రమువీఁదట వ్రాయు వ్రాసి యి
పడరఁగఁ జూచుఁ జూచి తనయక్కునఁ జేరిచి ముద్దుగొంచు నా
షడతుక నమ్మదిం బొడమి పాయనిప్రేమడి రేఁప నెంతయున్. ౧౮

క. వనితకుఁ దాపజ్వర మెచ్చినచోఁ బ్రియుకథల రతిని జెందుచు ననిశం
బును మెలఁగ నయ్యపథ్యం,బునఁ గాదే మిగులఁ దాపమున్ గఱుకైకొనెన్.

గీ. సంతతధ్యాతహరికథాసరసిలోన, నెప్పుడును దేలుచుండు నాయిగురుఁబోణి
కదియ సున్ను వియోగతాపాహికజ్వ,రాంకురంబున కగుహేతు వాదిమంబు.

సీ. తళుకొత్తుచెక్కుటద్దములకాంతులతోడ మందహాసంబులు మంద మయ్యెఁ
జెలులతోఁ జేయుముద్దుల ముచ్చటలతోడ శృంగారరచనలు రంగు దప్పె
నుడుగక వెడలు నిట్టూర్పులగమితోన కన్నీటిముసురులు గడలుకొనియె
నతిమనోహరరుచిరాకారములతోన మేల్మిబంగారునెమ్మేను డస్సె
మోహదశతోన కోరిక ల్ముంచుకొనియె, వెడఁదకన్నులతోఁ జేష్టవిప్పువదలె
బడలికలతోన చెమటలు వొడమఁ జొచ్చె, విరహవేదన నక్కాంత వేఁగుచుండ.

క. గురుతరమదనజ్వరవి,స్ఫురణం
జూడ నప్పుడు, ఖరశిఖిసంతప్తకనకకళికకు సరియై. ౨౧

వ. ఇట్లు దినదినప్రవర్ధమానవిరహవేదనాదోదూయమానమానస
న నిట్లని వితర్కించె. ౨౨

చ. నిగమగణోక్తికిం బరమనిర్మలమానసవృత్తికి న్సదా
సొగియనియట్టి కృష్ణపదసూచితవస్తువుఁ గాంతు (నేనెదన్)
పయోనిధి నీదఁగోరెద
న్మిగుల సుధాంశుమండలము మిన్నక చేతులఁ బట్టఁ గోరెదన్. ౨౩

గీ. అమ్మచెల్ల మహావిరక్తాగ్రయాయి,
ధికరాగసదావృతస్వాంతులైన, మాదృశులకబ్బుననుచు నమ్మంగవచ్చు.

క. చిత్తము గోరిన నబ్బులు, విత్తము లభియించునెడ దు
వత్తరమై తాపవహ్ని వారకపుట్టెన్. ౨౫

సీ. నిఖిలగాయకగాయనీదుర్లభం బైన యింపులపాట నా కేల యబ్బె
నబ్బుఁగా కేమి నా



నంపుఁగా కేమి నే నగ్గతి వినిపింప నద్దివ్యముని యేల యటకు వచ్చె
వచ్చుఁగా కేమి యవ్వాసుదేవస్వామిలాలితచారిత్ర (యేలచెప్పె)
యచ్యుతునిఁ గోరె నీకోర్కి యజ్ఞరచిత
కావ్యశేఖరి విఫలతఁ గాంచి హాస్యపదము గానున్న దిం కేటిబ్రదుకుత్రోవ.

ఉ. కన్నజ
విన్నయతండు దీర్ప మదిఁ బెట్టునొ పెట్టఁడొ ప్రేమఁ బూన న
న్నన్నలినాక్షుఁ డియ్యకొన నయ్యెడునో మఱి కాఁడొ యిట్టినా
బన్న ౨౭

గీ. వేఁడి వేలుపుకృష్ణుని వేఁడఁబోవ, గురుత కొంచించుకాంతయే కొఱఁతవడిన
గౌరవము వోవు నని చెప్పఁగాఁ బనేమి ౨౮

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనిచానలు చాలఁజాల న
చ్చక్కఁదనాలకుప్ప యదుచంద్రునిఁ దామె వరించి రన్న నే
నొక్కతెఁ బోల నెట్లు
సౌఖ్య మీవిరహ మెట్లు తరించెద నేను దైవమా. ౨౯

క. అరయఁగ బహుకాంతాజన, వరణాస్పదమైన వరుని వరునిగ మదిలో
ధాత దా నఘమొందుఁ.

*   *   *   *

వ. ఇట్లూహించువేళ నబ్బాలయూహాబలంబున. ౩౧

ఉ. కన్నియయంగకమ్రదిమ గన్నులఁ దన్ని జయింప బల్వెత
న్నిన్నక పంచతం గొనుచు మేల్గొనఁ దన్ను భజించు నమ్ములం
దిన్నఁగఁ దెల్పి చేసి పగ దీర్పఁగ వేళ యిదంచు మన్మథుం
*డన్నువ వెంట నంటుచు రయంబున లోఁగొనె నైదుబాణముల్. ౩౨

ఉ. తమ్ములుఁ గల్వలు న్మను బృథగ్గతి సాటికి రాక నీటిలోఁ
బమ్మి తపం బొనర్చి మెయి వాయుచు నెచ్చెలికన్ను లయ్యెఁగా
యమ్మదనప్రతాపతపనావృతిగాఁ దమచేష్ట వాయమిం
జు మ్మరవిప్పు మోడ్పులను జూడఁగ నయ్యెడు నింతినేత్రముల్. ౩౩

---

* డన్నువవెంట- మూలము.

క. కలువలుఁ దమ్ములు సరిగా, మెలఁగుట కోర్వంగలేక మెలఁతుకకన్నుల్
*బలుకోపుగదుర నిద్దుర, నొలయవును వికాసభావ మొందవుఁ దలఁపన్.

క. కాంతకు మదిఁ బుట్టుచుతల, పోంతలతో వేఁడియూపులతో మరుబ
్రోంతలతో మయిపూఁతల, రోంతలతో రేలు హ్రస్వలుత్తము లయ్యెన్.

క. కృశగాత్రి యనుచు నెప్పుడుఁ, గుశబుద్ధులు పిలువఁ బికకుచయుగంబుల్
కృశతఁ గొనె బుధగణోక్తులు, వశమే తప్పింప నెట్టివారికి నైనన్. ౩౭

క. రవణములు †మీఱెపడియెన్, ధవళేక్షణమేనుకీఁగ దాఁ గృశియింపన్
రవళి యిటు మాఱుఁ జెల్లదు, తవిలెన్బ్రభష్యతయె నిల్వఁదరమాయనుచున్.

క. తరుణికిఁ గ్రమమున రుచితో, నరుచులు మిక్కుటము లయ్యె నతివకురుచిగా
మరువేదన దినదిన మ, చ్చెరువుగ నంగంబు లెల్లఁ జిక్కఁగసాగెన్. ౩౮

క. ఆసమయంబున గుణవతి, యాసురచనసాధ్వలంక్రియాసాహిత్యా
బీసడ చేసి నిజేష్టర, సాసన్నస్వాంతవృత్తి నైవర్తిల్లెన్. ౩౯

ఉ. ఉత్తమగాత్రి కట్టియెడ నుత్తమ మయ్యెను గేశపాశ మ
త్యుత్తమ మయ్యెఁ జిత్తము మహోత్తమ మయ్యెఁ గటిప్రదేశ మే
కోత్తమ మయ్యె మోహనపయోధరయుగ్మము చిక్కనంగము
ల్మత్తచకోరలోచనకు మధ్యమవైఖరిఁ గాంచెఁ జిక్కుచున్. ౪౦

చ. విరహనిదాఘకాలమున వేమఱు మోము వడంకసాగె ని
ర్భరహృదయానురాగరసవారిఝురుల్వయి కుబ్బ నూర్మికో
త్కరములు కంకణాకృతులఁ దాల్చె నెలంతకు నంత వింత యి
ట్లరయ ఘటింపలేఁడె ఘటనాఘటనాకృతి మారుఁ డెంతయున్. ౪౧

గీ. మారనాటింధముఁడుతాపభారవహ్నిఁ
గ్రాఁచి తనతూపుమొనవాఁడి ‡కమ్మియచ్చు
చేత సంఘర్షణముసేయఁ జిక్కిచిక్కి
కనఁగనఁగుఁ జెల్వలలితాంగకనకలతిక. ౪౨

గీ గోకులాయతచేష్టసంకోచ మొదవె, నెమ్మిపురివిచ్చెఁ గాలుష్య మిమ్ము గొనియె
హంసజాతాంగయాతనాయత్తమైన, యతనుశరవర్షమవిరళంబగు నంబరగ.

మ. స్మరదావాగ్ని హృదంతరాళము దహింపం బైకిఁ బొంగెక్కు ని
బ్బరపున్ఖ్యాతి యనంగ నంగమున ధావళ్యంబు దైవాత్తె భీ

* బలునొప్పు — † మీఱుపడియెన్ — ‡ కలిమియిచ్చు — మూలము.

కరతతాకామశరప్రవర్షణమునం గన్పట్టు దూర్వా(తృణాం)
కురపుగ *జొంపమనంగఁ దీప్పు నెఱపెగ గుంపై నెలు ల్లోమునగ. ౪౪

గీ. ధార్తరాష్ట్రవినాదంబు లార్తులొదవ, మీఱఁగాఁబాండురాజకుమారగోచు
లనుగ సద్వర్గమామోదమంద మెలఁగ, నతనుశరశయ్య గాంగేయసుతను†వారగ

క. పువ్వులవిలుతునిపువ్వుల, ఉవ్వుల నునుఁబూలబంతిఉవ్వులు మఱచెం
బువ్వులు నవ్వులు మఱచెఁ, బువ్వులు దవ్వులను మఱచెఁ బూఁబోఁణితగన్.

సీ. తనువున నవమహాధనచేలము ధరింప దములంపు మకుకర్దమ మలఁదను
మోహనప్రాలంబముఖమాల్యములు గొన దతిరుచిరలలంతి కాదు లిడను
భృంగికలకధారణాంగీకృతికి రోయు నళనవాంఛకు దూర మగుచునుండుఁ
దాంబూలరుచు లానుతలఁపుంో మెలఁగను చవువులపైభ్రాంతిమొదవనీను
హీరమయపంజరాంతర చారుకీర, శారికారావములు వినఁ జేరఁ జనదు
చిత్తపద్మనికేతన(శ్రీ)నివాస, మాపజాలంబులోఁ జిక్కి రుచిరగాత్రి. ౪౭

గీ. అతనుసుమహేతిసముదయం బతనుకుచను
నతనుసుమహేతిసముదయం బమ్యె నపుడు
అతిఘనాబ్జసుచిస్ఫూర్తి యబ్జనయన
కతిఘనాబ్జసుచిస్ఫూర్తి యగుచు మెలఁగె ౪౮

క. అతిసూక్ష్మాంబరకుసుమో, ద్గతగంధము లానుపూర్వక కమలేకుణకుగ
అతిసూక్ష్మాంబరకుసుమో, ద్గతగంధము లానుపూర్వ గతిఁ గననయ్యెగ.

లయగ్రాహి. ఆటలకు ముందెసఁగుమాటలకు
నింపొనరుపాటలకు లేనగవుతేటలకు నెమ్మే
నీటులకుఁ గప్పురపు వీటులకుఁ బూఁబఱపుఁ
జోటులకుఁ గేళివనవాటులకుఁ గూర్పు
బోటులకు రేనిమరపాటులకు రవణముల
కోటులకు బోనములనేటులకు శారీ
చాటులకు సౌధముల చోటులకుఁ గిళలయల
వాటులకు బాల యొలెవాటులకు రోసెన్. ౫౦

గీ. అంతరంగము మాధవధ్యానపటిమ
కలితమై యొప్పఁ దద్వశగతము లగుచు

---

* జొంపమువారి— † వరగె— మూలము.

నఖిలవిషయములు మెలఁగ బాహ్యాంబుమఱచి
యయ్యె యోగిని యోగిని యనఁగఁ బరఁగె. ౫౧

క. అదిమఱచె నిదియుమఱచె, న్మదవతి యని పలుకనేల మది హరి నొకనిం
గదియుంచి మఱవదెప్పుడు, నదియు నిదియనక నేమి బాహ్యమంతయు మఱచెఁ.

గీ. సర్వకార్యాంతరాయంబు సంఘటిల్లు, వ్రీడగైకొన్న ననిచూచి వ్రీడమాని
వ్రీడవతియాత్మలోని యాభీప్సితంబు, కన్నతండ్రికి వినుపింపఁగాఁ దలంచు.

చ. నగుఁ దల యూఁచుఁ గన్మొగుచు నల్గడఁ జూచు వడంకు లేచు బ
ల్వగగాను మ్రాన్పడుం బొరలు వాడును శౌరిఁ దలంచి వేఁడు మై
గగుఱుపుఁ జేర్చు నుస్సురను గద్గదపాటు గనుం జెమర్చు నిం
పగు చెలిఁ బిల్చుఁ బల్కుఁడుగు నంబుజలోచన మన్మథార్త యై. ౫౪

శా. రంభారూపిణి చెట్టవట్టకొన నారంభించు శ్రీకృష్ణుడో
స్తంభం బంచు గృహేంద్రనీలరచితస్తంభంబుఁ దచ్చారువ
క్త్రాంభోజం బని గేహకుడ్యఖచితప్రాంచన్మహాదర్పణం
బంభోజానన ముద్దులాడ మొగ మొయ్యం జేర్చుఁ గామార్త యై. ౫౫

శా. నేత్రమ్మీలన మశ్రుచైత్యవిరతం నిష్కంపతాం స్విన్నతాం
గాత్రం యాతిచ హృష్టరోమచయతాం కంపైకసంపన్నతామ్
పాత్రం దుశ్చ్యవిసంగతేర్భవతి సద్వక్త్రం చలైశ్వర్యభా
జ్జిత్రాత్మప్రభవామణే స్సమజని గ్రీవా హ్యయోగక్రమాత్. ౫౬

క. మదనాసమశరమయ మని, ముదమున లోకంబు లెల్లఁ బొగడుట నిజమై
యొదవ మదనాగగామిని, మదనాసమశరమయంబు మానక యయ్యెన్.

క. అరయఁగ సస్ఫుటతాసుఁ, దరతాన్విత మగుచు సాధుతాభావిత మై
తరుణీమణివచనము ప్రా, గ్విరచితసరసప్రబంధవిధములు దెలుపున్. ౫౮

గీ. విషమశరశరవేదనోద్విగ్న యైన, వెలఁది మైఁదీఁగ భారతీవృత్తిఁ గనియె
నట్టివేళన పంకేరుహాప్తసూతి, విన్నని మొగంబు భారతీవృత్తి వదలె. ౫౯

గీ. వాక్కుతోడుత నత్తెటచెక్కులాఁడి
చాలఁజాలంగ నెడసెఁ బాంచాలిపొందు
చిత్రమొనరంగ నవ్వేళఁ జెల్వ మేను
చాలఁజాలంగఁ గొనియెఁ బాంచాలిపొందు. ౬౦

గీ. విషమబాణుఁడు విషమాస్త్రవేధ సేయ
నతనివామ మహాతపం బడరికాయ
నతసిసేనాఘునార్భటు లరిది డాయ
మోహనాకార బలు వైనమూర్ఛ మునిఁగె. ౬౧

—: కాళిందివేదనకుఁ గారణము నీలవేణి యడుగుట :—

వ. ఇబ్భంగి ననంగదశాలింగితాంగి యై పొరలు యమునాతరంగిణీసోదరిం గని సఖీసుముఖు లందఱు గుంపులు గూడి కూడనిమనంబున గుజగుజల బోవ వారల వారించి యమ్మింౘుఁబోఁడి విషాదంబు నివాదం బై సంభవిల్లుటఁ దన్నిదానం బిద్ది యని నిదానింప నంతఃకరణం బకరణంబుగా నేర దిది యే మొకో తెలియఁ దగు నని సఖీజనంబులు నెఱుంగకుండ రహస్యంబుగా నీలవేణి యయ్యళివేణి డాయం బోయి. ౬౨

ఉ. అల్లన లేవఁగాఁ దిగిచి యంకతలంబునఁ జేర్చి కన్నులం
జల్లఁగ జాఱునశ్రువులసంతతి కైవనఁ బాపి పెన్నెఱు
ల్మెల్లన గుంపుదీర్చి చనుమిట్టలపైటఁ గుదిర్చి కౌఁగిటం
జల్లఁగ దార్చి చెక్కుఁగవ జక్కఁగ నొక్కుచు మేను దువ్వుచున్. ౬౩

క. అమ్మవు గద రెండవమరు, నమ్మవు గద కాఁకదేఱ నట్టియుదిరిమే
ల్బొమ్మవు గద మరు నాఱవ, యమ్మవుగద యనుచు ముద్దులానుచుఁబలికెన్.

క. కన్నియ విశ్వంభరుకుడి, కన్నన రాజిల్లునట్టి ఘనుఁడు గదా నిన్
గన్నట్టితండ్రి గావున, నెన్నఁగ దుర్లభము నీకు నెద్ది జగములన్. ౬౫

సీ. వ్యాకోచనలినంబు వన్నె తక్కువగాఁగఁ గన్నులు విప్పవే వన్నెలాఁడి
యుదితరాకాచంద్రు నొఱపు కొఱంతగా మోమెత్తి చూపవే ముద్దులాఁడి
కలికి చిల్కలపల్కు కులుకు లుల్లులఁ జెందఁ దేటగాఁ బల్కవే నీటులాఁడి
తఱపివెన్నెలరంగు తలఁపులో మెలఁగంగ గొబ్బుగా నవ్వవే గుబ్బలాఁడి
విన్నఁదన మేటికే నీకు వింతలాఁడి, యేమి కన్నీరు నించెదే యించులాఁడి
వగకు నింతకుఁబనియేమిసొగసులాఁడి, తెలుపవే తెల్లముగమోవితీపులాఁడి.

గీ. మగువ యక్లిష్టముఖపద్మమండలమునఁ
బాయకుండెడు బిందుసంపాతమునను
మాధవులు దేల్పఁ దలఁచి లోమాఁకుఁ దెలియఁ
బలుకఁగాఁ జిత్త మిడవమ్మ పైఁడిబొమ్మ. ౬౭

శా. కొమ్మా నీవిధ మెంతయుం దెలియ మాకుం దోఁచ దేమమ్మ నీ
విమ్మై లోపలఁ గుందుచున్నఁ గని మా కెంతే భయం బయ్యెడు
న్నమ్మి న్నీకొనఁగూర్చు నెచ్చెలిని నే నిన్నంటి యుండంగ నో
యమ్మా చెప్పిన దోసమే యెఱుకసేయన్రాదె యే వింతనే. ౬౯

క. ఏమైన మున్ను నాతో, నేమంబునఁ జెప్పుచుండు నీకిపు డీవిం
తేమమ్మ తెలియఁ బలుకవు, తామరసదళాక్షి యింత దాఁపుర మేలా.

గీ. అతివ నీప్రాణపద మైనయట్టివస్తు
వితతిఁ బో.గొట్టికొన్నట్టివిధము దోఁచు
చున్నయది నాకుఁ జూడ నోసన్నుతాంగి
మాయ వెట్టక యెఱిఁగింపుమా నిజముగ. ౭౦

క. మానుగ నాకన్నను నెన, రైనచెలు ల్నీకుఁ గలరె యరమర సేయం
గా నేల తెలుపు నీతం, డ్రానసుమీ నలువతండ్రియానయుఁ జుమ్మా. ౭౧

ఉ. ఈగతి నీలవేణి కమలేక్షనియాన మెలంగఁ బల్కఁగా
నాగజయాన సిగ్గు మది నాఁటఁగఁ గొంకుచుఁ గొంత దేఱి చే
తోగతిఁ బ్రేమతోడ వగ దొట్రుకొన న్మను నారదుండు దా
నాగరుడధ్వజుం దెలుపు టాదిగ నంతయుఁ జెప్పెఁ జెప్పినన్. ౭౨

వ. విని యక్కాళిందీకీరవాణికి నానీలవేణి యొక్కింతవిచారించి యిట్లనియె. ౭౩

క. ఇంతీ యింతటిపనికిం, జింతింపఁగ నేల యొకటి చెప్పెద వినుమీ
యెంతైనఁ దల్లిదండ్రుల, వంతుసుమీ కూఁతుఁ దగినవరునిం గూర్పన్. ౭౪

వ. అదియునుంగాక. ౭౫

గీ. బాల్యమున మాతృపితరులుఁ బ్రాయమునను
మగఁడు *ముదిమిని దనయుండు మగువ కరయ
నధిపు లగుదురు తదధీన లగుటఁ గాన
మానవతులకుఁ దమయిచ్ఛ మలయఁజనదు. ౭౬

క. జనకాధీనలు కన్నియ, లనుట నిజం బాట వారలనుమతి సేయం
జనుఁ గాని తమకుఁ దామే, పనుపడి వరుఁ జేరఁ దగదు బాలల కెందున్.

వ. కావున మావలన నీవిధం బెఱింగి నీతండ్రి యగులోకలోచనుం డుచితో
పాయంబున శ్రీకృష్ణదేవుని రప్పించి నీమనోరథంబు సఫలంబుగాఁ బెండ్లి
సేయు నంతకు ధైర్యం బవలంబించి యుండు మని పల్కిన నీలవేణికిఁ గా
ళింది యిట్లనియె. ౭౭

---

* ముదిమించు-మూ.

—( కాళింది నీలవేణికిఁ దనయభిప్రాయంబుఁ జెప్పుట )—

ఉ. కూఁతురు పుట్టినన్ జగతిఁ గోరికతోఁ దలిదండ్రు లెల్లెడన్
ఖ్యాతిదనర్చు మేల్వరుని బంధులలో వెదకంగఁ జూతు రి
ట్లీతతి *సప్రయత్నగతి నిట్టివిభుండు లభించు నప్పు డ
య్యో తలిదండ్రు లేలొకొ నయోచితిఁ గూర్పఁగఁ జాల రంగనా. ౭౯

ఉ. తల్లి ధనాఢ్యు సశ్రుతునిఁ దండ్రియు బంధులు సత్కులీనుఁ గా
నెల్లరు నోదనప్రదుని నెన్నఁగఁ గన్నియ రూపవంతుఁగా
నెల్లెడఁ గోరు నిన్నియును నేర్తెఱఁ గల్గినకృష్ణుఁ గూర్ప లే
రుల్లము రంజిలం దన కయోచెల యిట్టి యయోగ మారఁగన్. ౮౦

శా. ఎన్నాళ్లో గోలె నాకుఁ గూర్మి గలవా రేకా చెలు ల్వీరలై
నన్నున్ డెందమునందుఁ బొందుపఱుపంగాఁజాల రై రక్కటా
నన్నుం గాంచిన తండ్రిగా తపనుఁ డైనం దాఁ బ్రసన్నుండుగా
కున్న న్వెన్నుని మన్నన న్ననయుఁగా నూహించువా రెవ్వరో. ౮౧

చ. తమమది నెన్నఁ నా వరుని దార్చినకన్యలబుద్ధి నెట్లుగా
నమరునొ యంచుఁ గాదె జను లట్లు స్వయంవరక్లప్తిఁ గాంతు రిం
తమనికితంబు లేక యిటు నాథుని మాధవుగాఁగఁ గోరికొం
టి మది గరంగి తండ్రియు వడిన్ ఘటియింపఁ డి దెట్టిభాగ్యమో. ౮౨

ఉ. కాఁకలు ముంచికొన్నమెయి గాంచినవానికి జన్మమంది నేఁ
గాఁకలు ముంచికొన్నమెయి గాంచితి హేతుగుణంబు గార్యము
న్సోఁకదె తప్పనంటిఁ గొఱనోములు నోఁచిననాక యిట్టి బ
ల్గాఁకలు గాక యాజమున కాఁకలు గాంచెనె సూర్యజాత నై. ౮౩

చ. గ్రహములు గన్నవారు గ్రహరాజకుమారిక సాటి గాంతు రే
రహి నని తోడ నాడఁగ విరాజిలుదు న్మది నట్టివారె ప్ర
త్యహ మవియుక్త లై కువలయా ప్తశిలామయసౌధవీథిలో
బహువిధసౌఖ్యము ల్గనఁగఁ బంకజలోచన నేనె చూచెదన్. ౮౪

వ. అని యిట్లు త్తలపడి పలుకు నమ్మత్తకాశినిచిత్తంబు పురుషోత్తమాయత్తం
బగుట యెఱింగి యన్నీలవేణి యప్పువ్వుఁబోణి కిట్లనియె. ౮౫

*సంప్రయత్న - మూ.

క. ఇపు డేను బోయి రవికిం, గృపవుట్టఁగఁ దెలియఁబలికి కృష్ణుని బిలువం
జపలాక్షి పంపి వచ్చెదఁ, జపలత వోనాడి స్థిరతసంధిల*వమ్మా. ౮౬

గీ. అనిన సమ్మతించి యతివ ధైర్యంబూని, చలన ముడిగి కొంత శాంతిఁబొంది
స్నానపానవిధులు సలుపుచు నొకరీతిఁ, జెలులఁ గలసి మెలఁగి చింతదేఱె.

ఉ. అంతట నీలవేణి చెలు లందఱు కవ్విధ మెల్లఁ జెప్పి మీ
రెంతయు నాటఁ బాట మఱి యొపుల గానవిశేషవైఖరిన్
ఇంతికిఁ గృష్ణుపై మమత యించుక యైనను దోఁపకుండు నా
వింతలు చూపుచుండుఁ డిట వేగమె యేఁ జని వచ్చునంతకున్. ౮౮

—( నీలవేణి ఛాయాదేవికిఁ గాళిందివృత్తాంతముఁ దెలుప నేగుట )—

సీ. అని నీలవేణి యి ట్లతివలతోఁ జెప్పి కాళింది నూరార్చి కడఁకమీఱ
నతిరయంబునను ఛాయాదేవికడ కేగి సరవి నాయమ కుపచారవిధులు
సలుపుచు సుతవార్తఁ దెలిపి వేవెలుఁగున కావార్తఁ దెలుపంగ నవసరంబు
వడయక సందడిఁ బడియుండె నిచటఁ గాళిందియుఁ దమకూర్చు లేమగముల
యాటపాటల వింత సయ్యాటములను,హంసగతులను గేకినాట్యములఁ జిలుక
పలుకులనుమఱపుపుట్టింపఁబడియుఁబడక,వంతమరుఁ డేఁపమన్మథావస్థఁ జెంది.

చ. బయలును గౌఁగిలింపఁ గయిబారలు సాఁచు వికావిక న్నగుం
బయఁటఁ దొలంగి కన్పడుఘనస్తనగుచ్ఛము లప్పళించుచు
న్నయమఱి పాదుదప్పి ధర నల్గుఁడు గైకొను పువ్వుఁదీఁగెఁ బో
లి యొరలి సజ్జపైఁ బొరలి లేచు వగ న్మరుబారి కగ్గమై. ౯౦

క. చదల శశాంకుని గనుఁగొని, మదిలో శ్రీకృష్ణు వదనమండల మనుచున్
ముద మొదవ సువదనామణి, వదనం బొగి వాంచి ప్రేలవసుధన్ వ్రాయున్.

వలపులు గుల్కుపంకజము వారిజలోచను వక్త్రమంచుఁ దా
వలపులు బల్పు గైకొనఁగ వాసనచూడఁ దదంతరాళిస
మ్మిళదళి వే చుఱుక్కనఁగ మెత్తనివాతెఱ నంట నొచ్చెరా
తలతలలోరి ధూర్త యని తన్వి మొగం బెగఁద్రిప్పు వేమఱున్. ౯౧

చ. చెలువలు మేనిపూఁతకయి చెంగటఁ బెట్టు మృగీమదంబుఁ దాఁ
నోలయక †యొల్లమీఱె వికచోత్పలలోచన రోషవీక్షణాం

* గమ్మా. † నొల్లమీఱి వెనుకన్ వికసితోత్పల-మూ.

చెలములఁ జుర్చురం గను నిజప్రియనీలతనూపమంబుగా
మలయజగంధి గన్గొను నమందరసావహదృష్టిలీలలన్. ౯౩

క. ఘనసారరజముఁ జూడఁగ, వనజేక్షణ వెఱచి శౌరివరహాసశ్రీ
తనరు నని తలఁచి వేసుఱుఁ, గనుఁగొను నొకకొంతతడవు కడుమోదమునన్

ఉ. సిగ్గున మోము వాంచి నునుఁజెక్కులఁ జెమ్మట గ్రమ్ముదేఱ మే
లగ్గుమిటారిగుబ్బచనుజక్కవ లుక్కున నిక్కి గ్రక్కునన్
లొగ్గక పైఠణీఱవికలో నుమిటారఁగ సారసాక్షి చే
నిగ్గులతమ్మి ద్రిప్పు హరినిద్దపుఁగైసుడివాలు *డంబుగన్. ౯౪

సీ. మృదులఫాలమునందు మృగమదంబు ధరించి యొన్నుఁజూరురత్నమ్ముఁబూని
నాసికాగ్రమునందు నవ్యమౌక్తిక మూని కరమున రత్నకంకణము లూని
కరతలంబున వేణుకాండంబు ధరియించి నెమ్మేన హరిచందనమ్ముఁ దాల్చి
కంఠదేశమున ముక్తాస్రజంబులు గూర్చి రాణించుపీతాంబరంబు గట్టి
కొంతతడవు సుఖించు కోమలాంగి, యాత్మనాయకకమలాసహాయవేష
సముచితాలంక్రియావస్తుసమితిఁ గొనుచు, నార్తిచేఁ గొంత సేపునకవియుఁగినియు.

గీ. మాధవునిపొందునకు నేను మనసుపడితి
నింపు గాకున్న నతఁడు నన్నేలఁడేని
అక్కటా యిద్ది కథయు దృష్టాంత మగుచుఁ
బరఁగునో యేమొ యిల రసాభాసమునకు. ౯౫

సీ. ఏగతి నతనిపొం దే నందనయ్యెద బహువల్లభాప్రియుఁ బడయ నేమి
నీరజాక్షుని గన నేన పోయెద వేగ నీయెడ నింకేమి సేయుదాన
నిదెతానె విభుఁ డిటకేలమి నేతెంచెఁగా యితనిమోము గనంగ నెనయదుమతి
వేళంబ కావలె వెన్నునితోఁ బొందు నింతలో సీసౌఖ్య మేల కల్గు
నిట్టిచెలువున మెలఁగెడు నింతి విడుచు, మనసు గైకొన వెఱ్ఱియే మాధవుండు
ననుచు మన్మథవేదన నబ్జవదన, భావభేదంబులను జాల బడలుచుండు. ౯౬

గీ. ఇట్లు దరిలేనివేదన నింతి యొఱల, నింతనంత మెలంగెడు నిగురుఁ†బోండ్లు
మిగులవగనూరుమనసుల మేలుదక్కి, భామ వినకుండ మెల్లనఁ బల్కుకొనిరి.

గీ. తలఁప జగతి నయోగఖేదంబు గాంచు
వెలఁదులను గన్నయది లేటొ వినఁగ లేదొ

---

*దంబొగిన్. †బోట్లు.

మనచెలి యనురాగవేదన గనఁగ నరిది
గడనసేయదు విరహదుఃఖంబు నైన. ౧౦౦

క. మగబొమ్మఁ జూడనొల్లని, మగువ మగఁడు గావలె నని *మరుగుచు వేర
మ్మగుసిగ్గు మూలనుట్టుగ, దిగఁద్రోచెను గాక యింతతీండ్రము గలదే. ౧౦౧

చ. అనుచుఁ దొడంగునిందుముఖు లందఱు నెవ్వగఁ జెంది యొ†ట్లొకో
వనరుహపాణి నివ్విధలఁ బాపునుపాయము నీలవేణి వ
చ్చినతరువాత నన్నియును జెల్వగుఁ జేరకపోయె నంచు ని
ల్వనఁ దలపోయువారలకు లోలవిలోచన డాసి నిల్చినన్. ౧౦౨

వ. ఇట్లు నిలిచిన నచ్చెలు లందఱు నీలవేణి మనమాటలోనె వచ్చె. నిఁక నేల వలవనివలవంత చింత లనుచుఁ గచ్చుకొని తన్నుఁ జుట్టుకొని గజిబిజిపడు నగ్గజగమనలం గనుఁగొని తనతరువాతిప్రోడ యగుశుకవాణి నిది యేమి యో యని యడిగిన నప్పడంతి యప్పొలంతి కి ట్లనియె. ౧౦౩

—( కాళిందివిరహమును శుకవాణి నీలవేణికిఁ జెప్పుట )—

ఉ. కప్పురవీడ్య మొల్ల దొసఁగన్ జిలుగున్ జిగివల్వఁ గట్టఁ గా
నొప్పదు చామరంపువిస రొప్పఁగఁ జాలదు పూలదండలం
గొప్పన నుంపఁగానియదు క్రొన్నిలుటద్దముఁ జూడ ‡దింక నే
మప్పరొ యాడిగంపుఁబను లప్పను లన్నియు మానె నింతికిన్. ౧౦౪

చ. దిరిసెపుఁబువ్వువంటి నునుదీఁనబంగరుమేను కాఁక చేఁ
దెరలఁగఁ బాఱె మైనసదుదేర విభూషలు జాఱెఁ §జెయ్వులుం
గఱకటివాఱె గుబ్బచనుగట్లు వణఁకఁగ వేఁడియూర్పుల్
దఱచులు మీఱె నీకొలఁది నంగనరాని విరాలిఁ గూరెడిన్. ౧౦౫

క. ఎక్కడితాపము చెలువకు, నక్కజ మిది చూడ ముక్కునందలిముత్యం
బెక్కుడునూరుపుఁగాఁకల, స్రుక్కుచు బలవైరినీలరుచి స్రుక్కించెన్. ౧౦౬

ఉ. చక్కనిపెన్నిటిం గొన విచారము సేయఁగఁ గార్యసిద్ధికి
న్నిక్కము చాలఁ దప్ప నటునిల్వఁగ నంటునఁ గందు దీనిమే
నెక్కెడ నిట్టితాపభర మెక్కడఁ గప్రపుఁదావు లీను నీ
చక్కనికొమ్మ నెమ్మనము చాల మహానలకీల లీనెడున్. ౧౦౭

---

*మగనిమరువేరెమ్మగు- †ట్లకో- ‡జింతయే- §చైవులు-మూ-

చ. అలికులవేణి సన్ముఖమునందు వసించు ద్విజాళి నాఁగు మే
ల్గల పవడంపుఁగోటగు చొకాటపుమోవిది వేఁడియూర్పులన్
బలువిశిఖంబులం బగులువాఱఁగ నేసె మరుండు వానిమై
నిలువది యంత నీ అయిన నిక్కము గా మన యీసుదీర్ఘమున్. ౧౦౮

మ. చ్యుతసంస్కారతఁ గాంచి రక్తిమ గుణస్ఫూర్తి న్నివారించి సం
తతపారుష్యము మించి సద్రసమృదుత్వంబు ల్విసర్జించి సం
గతిఁ దప్పించి వ్రణంబు మించి కుకవిగ్రంథంబువోలెం గటా
సతిదంతచ్ఛద మొక్క హాస్యపదతం జాలించె వీక్షించితే. ౧౦౯

చ. హృదయమున *న్నివిష్టజగదేకభరాతతకుక్షి శౌరి దాఁ
గదలక యుండుటం బొడమెఁ గావలె మేన నలంత సేద ని
మ్ముదితకుఁ దత్పదానుగతభూరిభుజంగవిషాగ్నికీల లో
వదలక నిల్వఁగాఁ బొడము వక్త్రవినిస్సరదాశుగావళుల్. ౧౧౦

క. అనలంకృతి వ్యాకీర్ణతఁ, గని యక్రమమై పతత్ప్రకర్షం బగుచున్
వనజాక్షికచకలాపం, బనభిజ్ఞకవిత్వరీతి నతిఖిన్న మగున్. ౧౧౧

క. అక్క యిక్కాంత చింతకు, న్నక్కడిమే రకట చెక్కు నెడయదు హస్తం
బక్కుసుమధన్వుఁ డేయం, జిక్కినవిధుతూఁడుఁదమ్మిచిలుక మ్మనఁగన్. ౧౧౨

ఉ. పంజరమధ్యసీమ శుకభామకుఁ బల్కులు నేర్ప దంచకు
న్నంజలు గూర్ప దున్నదశిఖాన్వితపాళికి నాట్యవైఖరుల్
రంజిలఁ జూప డింపు లలర న్నశివీణియ మీటి పాడ ది
మ్మంజులవాణి †నొందిలిక మాతరమా తరలాక్షి చెప్పఁగన్. ౧౧౩

ఉ. అంగన కంగజాతదశ లంగమునం గడుఁ దోఁచె సందియం
బుంగనలేదు కృష్ణుకడ మోహము దాహము దాఁకె నేలయం
చుం గనుపించు కోక సతి చుట్టు మెలంగితి నీవు వచ్చి తిం
కం గర మారయం దగునుగా యనఁ జెల్లెలి కక్క యిట్లనున్. ౧౧౪

గీ. వినుము శుకవాణి నీకన్న మునుపు నాకుఁ, దోఁచె నేఁ జెల్లయీ చెల్వదోసమేమి
యువత యేనియు వెన్నుని ‡యవ్వనాఢ్య, భావరేఖావిలాసవిభ్రమము లెల్ల.

ఉ. కన్నులఁ గన్న వీనుఁగవఁ గ్రన్నన విన్న నటంత నే వడిం
గ్రొన్ననవిల్తుఁ డమ్ము విలుఁ గూర్ప నెడ న్మొగిలేక వైఁడిజం

---

*న్నివిష్ట. †నిందలిక– మూ– ‡యౌవన– అనుట యుక్తము, గాని, పాదాదియందు యౌవతయనుటకు యవతయని ప్రయోగించుటచేఁ గవిప్రయుక్తమిదియె యేమో. కాని ప్రామాదికము.

టన్నగు కన్నె గేదఁగితుటారిమిటారికటారిఁ దాఁగటా
కెన్నికఁ దీసి యాయమున నే యదరంటఁగ దానిఁ గ్రుమ్మఁడే. ౧౧౯

గీ. అయిన నిట్టిమాట యావెలందుకయొద్ద, ననిన డిల్లగుచు నట్లు గాన
నరయుదము పసుఁడని యతివలందఱు దాను, నింతియింటికేగి యెదుటనచట.

క. కనుఁగొను నెడ నచ్చేడియ, తనమది మదనానలంబు దరికొని కాల్పన్
వనటం బొగులుచుఁ గృష్ణుఁడు, తనకన్నులఁ గట్టినట్లు దనరినఁ బెలుచన్.

—॥ కాళింది మనసునఁ దోఁచినకృష్ణుని బ్రార్థించుట. ॥—

క. పలుకుం జెలి నునుముంజేఁ, బలుకుం జిగి ముద్దుఁజిలుకపలుకులఁ బ్రోవం
బలుకుఁగులుకొలుకుపలుకులు, పలికెంబఱుకన్మోర్చిలుకు భావముదోలఁక.

ఉ. కాయము మారుబా(ణముల) గాయముల న్వగఁ జెంది వేఁడఁగా
దాయవు మోముఁ జూపవుగదా యనుగుండియ పూనిఁ యేఁపఁగా
నాయము గాదు సిగ్గు విడ నాయముగా దని మిన్నకుండఁగాఁ
జేయదు పాప మీవలపు చిత్తము తత్తఱ మాఱఁ జేరవే. ౧౨౦

సీ. ఇపుడుగా కనుగల్వ లింపుసొంపులుమీఱి వెలసె నీరాకకు విబుధచంద్ర
యిపుడుగా యీమేన నెనయుతాపం బాఱె నినుఁజూడ సత్కాంతినీరవాహ
యిపుడుగా హృత్పద్మ మెసఁగె సామోదమై సరస నీవు మెలంగ సాధుసూర్య
యిపుడుగా మానసం బేర్చుఖేదతమంబు స్రుక్కె నీచే సుతేజోహుతాశ
యిపుడుగా కామినీమాత్ర మెనయలేని, సౌఖ్యసంపదఁ గైకొంటిసన్నిధాన
యిపుడుగా సౌమనస్యంబు నిరవుకొనుచు, సొబగుమీఱఁగ నలరెదసురభిచరిత.

సుగంధి. మానరా చలంబు నిన్ను మాని యన్యుఁ బూనరా
పూనరా నిజార్తి మాన్పఁ బుణ్యమొందు గానరా
కానరా కృపం దనర్చి కావు నేను దీనరా
దీన రాసికీర్తి లేదు దేవ నీకు దానరా. ౧౨౨

ఉ. చొక్కితి నీదుముద్దుజిగి చొక్కపుఁబ్రాయపు రూపుమేల్మికిం
జిక్కితిఁ గమ్మఁదేనె జడిచిల్కఁ లఁ (జిమ్మెడు) మారుబారికిం
దక్కితి నీకు వాఙ్మయసుధారసధారలు గ్రుమ్మరింపఁగా
గ్రక్కున గారవింపు బిగికౌఁగిట జాగిటు లేల యేలరా. ౧౨౩

చ. మనమొగి సర్వకాలమును మానక నిన్నె భజింపఁ దద్బలం
బున భవదాకృతిం గనియెఁ బుణ్యవరేణ్య మనంబు కూర్మియున్

మనసిజవేదనాభరము మానుగ దేవరకేల లేదొ యి
ట్లనఁ దగు నెట్లు నీవు ఘటితాఘటనాకృతివాడ వీశ్వరా. ౧౨౮

చ. స్థిరత గనంగఁ జాల దొగిఁ జిత్తము బాహ్యవిశేషవస్తుసం
సరణము గాంచు నంచుఁ బలుజంపులు సేయుచుఁ బ్రోవకుండెదో
యరయ నణుప్రమాణ మగునట్టిమనంబు సమస్తకుక్షి నై
పరఁగెడు నీవు ముంచికొన బాహ్యముఁ జేరఁ జరింప నేర్చునే. ౧౨౯

ఉత్సాహ. వగపు జాఱ వగలు మీఱ వలపు లూరఁ జేరరా
నగవుసోన మొగముతోన నలువుపూనఁ బ్బల్కరా
తగవు మానఁ జనదు గాన తలఁపులూనఁ గూడరా
బిగువుఁజన్ను లురముచెన్నుఁ బెరయ నన్ను నంటరా. ౧౩౦

క. కరుణ వొడమ నీకరణిం, గరుణ స్వనతఁ బలుక మదిఁ గనఁబడు మాయా
తరుణుం డూరకయుండిన, దరుణీమణి హృదయసీమఁ దలకొనునలుకన్.

గీ. నెనరుచేఁ బాలొసంగెడునెలఁతపాలు, విసముగాఁదలపోయుచుఁబిన్ననాఁడు
అకట తెగటార్చుపనివాఁడ వౌటఁ దెలిసి, వెండి నినుఁగోరుటెల్లను వెఱ్ఱిగాదె.

చ. కల నయినం బరుం గనుట గానని వ్రేతలనెల్ల శీలముం
దొలఁగ విరాళి ముంచి రతిఁ దోఁగఁగఁ జేసితి వాదియందు ని
వ్వల బలిమాలినం దిరిగి వంగియుఁ జూడ వటన్న విన్కని
న్గలయఁగఁ గూడ దా వలపు గట్టిగఁ బట్టె న దేమిసేయుదున్. ౧౩౧

క. అగుణుఁ డరూపుఁ డనాముం, డగుట న్నాకతఁడు లక్ష్యమా యని శ్రుతులే
తెగి చాటి చెప్పఁ దెలిసియుఁ,దగని తగులునకు మనంబుఁ దాఁ బరువెత్తెన్.

చ. మునుపటిపుట్టుక న్భువనమోహిని మైథిలకన్య (కూర్మి) నిం
డినతనభార్యఁ జిచ్చున వడింబడఁ జేసెను నిర్దయాత్ముఁడై
నను నిపు డమ్మనోభవునసారతబాణపరంపరాహుతా
శనఘనకీల మ్రంద నిడఁ *జాలఁడె తాళఁడె వీఁడు జాణఁడే. ౧౩౨

గీ. ఒఱలు చిట్టు కృష్ణునొడబెఱుంగక దూఱు,కొనుచు మోహావశతఁగూరుచున్న
తరణితనయఁ జూచి తరుణులు మది మీఱు,నార్తి డాయవచ్చి యతివ కనిరి.

క. వచ్చె మనసీలవే ణిదె, మచ్చికఁ గను విచ్చి చూడు మనికిత మెల్లన్
విచ్చును సత్యం బాడెద, మొచ్చెము లే కిచ్చ లెల్ల నొదవెడుఁ దల్లీ. ౧౩౩

---

*జాలెడు-మూ.

వ. అని పలుక నచ్చెలుకలకొలికి యించుక కన్నువిచ్చి హెచ్చు మనోజవేదనాభరంబున. ౧౩౪

చ. అదె సఖులార పట్టుఁడు మదంతరశాంతినితాంతరాగసం
పదలు హరించి చోరుఁ డటు మాయముఁ జెందు నటంచుఁ బ్భ్రాఁగా
మదితరో వింటె యా నవును ముద్దియకో యని తారకాణగా
మది సరిపుచ్చుకొంచు నడుమాననినెవ్వగ నీలవేణియున్. ౧౩౫

ఉ. డాయఁగవచ్చి యమ్మరుకటారికి డాయఁగవచ్చు నెచ్చెలిం
బాయనికూర్మిఁ గౌఁగిటికిఁ బాల్పడఁజేయుచుఁ దల్లి చింత నీ
కీమెడ నేల చింతిత మొకించుకనాఁడు సహింపఁ జేకుఱుం
గాయజునాన నానకృప గల్గఁగఁ గల్గని దేమి నీకగున్. ౧౩౬

క. పరమాణుమధ్య వినుమా, పరమాణుద్రష్టలేని పట్టఁగ నిది మా
తరమా యనఁదగునట్టిది, పరమార్థం బైన దొరకుఁ బరమార్థముగన్.

క. తరళేక్షణ పరిమాణ, స్వరసంధిక్రియ విపత్తిఁజను పటుధైర్య
స్ఫురణము తద్ధ్వాంచ, త్స్వరసంగతి సాటి శోకసంగతి కమరున్. ౧౩౮

గీ. ఇట్లు నీలవేణి యెంతేని నెనరునఁ, జెలులతోడఁ గలసి చింతదేర్చు
చుచితమైనయట్టియుపచారములుచేయు,చుండియించుకెడయనొకదినమున.

క. ఇంతి యయోగవ్యథచే, నెంతయుఁ దెలువెక్కు మేన నెనయు త్రియామా
కాంతద్యుతులుం దెలియు ని,తాంతోష్ణిమచేత మిగులు తాంతతకలిమిన్.

క. మొగు లెఱుఁగనిబలుచిత్తడి,మిగుల నొగిలెఁగన్నుదోయిమెలఁతకు దానన్
మిగులుచు నస్మాయితాపము, తొగకంటికిఁజిత్రమరయఁదొలఁగక నిలిచెన్.

—( కాళింది చెలుల మొఱఁగి యుద్యానమున కేగుట )—

వ. అప్పు డమ్మోహనాంగి సొంపు దొఱంగి కుసుమశరుండు కుసుమశరాసనంబు గుడుసువడ భసలగుణంబునం బొసంగించి మించి కుసుమశరవిసరంబులు విస్మృమరగతిం గసరి ముసురుకొనఁ బరఁగింప వెఱఁగుపడి విరహపరితాపశరధిఁ దరియ దరి లే దని తదుద్భటభట చటులమహాటవిం బడి వడిం దద్విశిఖశిఖిశిఖాసంఘాతంబుల నిడి యొడలు విడుతు నని కడిందిసాహసంబున నుడిగంపుఁబడంతులఁ గూర్మిమడంతుల నెఱుఁగ నీయక యొంటిఁ బడుకింటిలోని పాన్పు డిగ్గి వెడలి చనుసమయంబున. ౧౪౨

క. అత్యుద్ధతకుచజఘన, ప్రత్యుక్తం బగుచుఁ గ్లేశపడు నవలగ్నం
బత్యంతదుర్బలం బై, యత్యుద్ధతు లొదవఁ బేద కబ్బునె సుఖముల్. ౧౪౩

చ. వెనకుపొలంతు లత్తెఱవు వేగఁ గన న్సుమనో వ్రజంబు దాఁ
బెను నెఱిగుంపుటి ర్లోరసి పెల్లు వహుం గఠినంపురత్నముల్
సను *నటుసేయఁ దద్గుణము సన్నను దత్కృతి కేల చాలెడుం
గనుఁగొన †నట్టి నైకగుణగామిత సన్మణులందు వింతయే. ౧౪౪

క. వలఁ బాసిన జక్కవకవ, వలె జాలియ నెడయు మేలు బంగరుబొంగ్రం
బులు వోలెఁ గుచము లగపడ, బలుఅొమ్ముపయి న్నెలంగుపయ్యెదజాఱున్.

చ. తెలివకుఁ గెంపుఁగంట నెఱత్రెవ్వని బాష్పకణాబు లత్తఱిన్
మురు వగుఁ దొల్తఁ గావి తెలిముత్యములై మఱి వెండి యూర్పుఁ బె
క్కఱిమినఁ గందుమోవిపయి నాఁని వెసం ‡గయిపెక్కుఁ గెంపులై
నెఱిఁ జనుగట్టులన్ దొరసి సీటకుఁ గ్రాఁగిన పొన్రజంబులై. ౧౪౬

గీ. కన్నె కైదండ లేక ము న్నెన్నఁడేని, నడుగు వెట్టఁగఁజాలని యబల తెంపు
కతన లేనిదిజవమూనికడఁగినడచె, నహహపూఁబోణులధిక సాహసలుగారె.

ఉ. అంతము లేని పంకజభవాండము లొక్కెడఁ దాల్చుకుక్షి మే
ల్వింతలమాయ కొల్లని నవేద్యమహామహిమంబుచే నణు
స్వాంతమునందు లీలగ నహర్నిశమున్ భరియించునట్టియ
క్కాంతకుఁ దోడు గావలెనె కంతుఁడు తోడుగ నొంటి క్రీడనే. ౧౪౭

వ. ఇట్లు చని యంత, ౧౪౮

క. నవరసఫలరుచిరశోభిత, కవిరాజను సుప్రసాదఘటితము నగుచున్
ధవళాక్షి సన్నుతంబగు, కవిసత్కృతిఁబోలు కేళికావన మొందెన్. ౧౫౦

స్రగ్ధర. చిగురాకుఁజిచ్చుమంటన్ జిగిదళుకొని పిఁజించి పూఁగమ్మనుమ్ముల్
మొగిసుళ్లుగట్టి మింట న్మసరు తెరువునం బువ్వుఁదేనెల్ జడి న్మం
పఁగ మేల్సంపంగిపుప్పొంబదుపు రవితతు ల్పర్వఁ గల్పాంతకాలం
బుగతిం బొల్పారుకోనం బొరపడుచు వడి న్మూర్ఛిలంబాఱియంతన్ ౧౫౧

ఉ. తెప్పిఱి యెట్టకేల కిటు దెల్లినఁ బైపయినుండి పూవిరుల్
గుప్పిల నున్నమేనునను గొబ్బున బొబ్బలు లేవఁ గ్రిందటం
బుప్పొడి సోఁకి పాదములు పొక్కఁగఁ జేతులఁ దోఁగితోఁగి చే
యప్పటియట్లు పొక్కినను హాయని యూర్చుచుఁ బొర్లిపొర్లి యున్. ౧౫౨

ఉ. అంతట నొయ్య లేచి చరణాబ్జములం గనకాబ్జపత్రపున్
దొంతర దానినూలుకొని నూల్కొనఁ గట్టి జరంగుచు న్వధిం

---

*నిటుసేయసద్గుణము-మూ †కంటి-మూ ‡గటిపెక్కు-మూ క్రీడనే.

జంతిలె నక్కటా యొకలు చెచ్చెర వీడఁ దలంచినన్ క్షణా
బింతట నిల్వఁగా దొరకునే మొ యిటేలొకొ దాఁటి వచ్చితిన్. ౧౫౩

వ. అనుచుఁ జింతింపుచుఁ గనువిచ్చి కనుంగొనఁ గట్టెదుట నంత. ౧౫౪

ఉ. తామరతూఁడునాళములఁ దార్కొను తుమ్మెద యిన్పగుండు లు
ద్దామతఁ గూర్చి నల్లగిసెతావులపుప్పొడిమందు గూరియున్
హేమలత ల్సమాగ్నిశిఖ లేరు మజానకిత్రా డమర్చి యా
పై మొగరంబుగట్టిన తుపాకులపె ల్లెలగోలుమూఁకలున్. ౧౫౫

మాలిని. చికిలితళుకుఁగళ్కు ల్జిల్గు జాళ్వామొలామా
నికరపుఁబరుల న్రాణించు గేదంగిపువ్వ
ల్గుకలను మొనయాఁకె ల్గుంపుగాఁ గూడి యచ్చోఁ
బ్రకటత నెలగోలుంబారు వెన్కం జెలంగన్. ౧౫౬

సుగంధి. పచ్చజాతిడాలు తెక్కపక్కెరల్ చెలంగఁగాఁ
బెచ్చుపంచదార మెక్క బీరుమీఱు రంతులన్
గ్రుచ్చి పాంథవైరకోటి గుండెలల్ల వ్రేలఁగాఁ
బచ్చి దేలు మారుతేజిపౌఁజు లొప్పె నాదటన్. ౧౫౭

ఉ. తుమ్మెదసర్పణ ల్బారయ దూఁకొని పుష్పరసోరుదానముల్
గ్రమ్మి భరమ్ముగాఁ గురియఁగాఁ జిగురుంజిగి మేలుధాతుచి
త్రమ్ముగ నొప్పఁ బువ్వగమి దట్టపుడాలు మెఱుంగుఁగత్తులై
ప్రమ్మగఁ గుంజకుంజరపుఁబంక్తులు రంజిలె *నక్కజంబులన్. ౧౫౮

మత్తకోకిల. వల్లిరశ్మిపినద్ధచక్రనిబద్ధకోకిలఘంటికా
వేల్లదారవకీరఘోటకవిస్ఫుటోదయకేవలో
త్ఫుల్లసూనశరాసబాణమనోజ్ఞతూణసమగ్రతా
సల్లలత్తరుచిత్తభూరథసంఘ మాదట నొప్పగున్. ౧౫౯

శా. నానాసేనల నీగతి న్భువనసన్నాహ్యాత్మజైత్రక్రియా
త్రానూనంబుగఁ జైత్రమంత్రివరుఁ డాయత్తంబు గావింపఁ దే
జోనవ్యుం డసమాయుధుండు నిజవిస్ఫూర్తి న్విడంబించిన
ట్లైనం జాన యిఁకె ట్లొకో తెలుసువం చాత్మ న్విచారింపుచున్. ౧౬౦

మత్తకోకిల. ఇంక నొక్క యుపాయముం గల దీక్షణం దనప్రాణముల్
గొంక నొక్కతఱిన్ హరింపుచుఁ గూరి కాఱియ వెట్టకే

*నక్కరంజులన్ - మూ.

నంకి లంతయుఁ దీర వేఁడెద నాతనిం బ్రియమందఁ ద
త్పంకజేషుశరాగ్నిదుస్సహశయ్యపై నొడ లేర్చుచున్. ౧౬౧

క. మారుదయ చాలు నతనికి, మాఱువలుక వెఱచునొక్క మాఱును దేఁటుల్
మారుతములు శుకపికభా, మారుతములు మదనదనానమారుతము లొగిన్.

వ. అని నిశ్చయించి. ౧౬౩

చ. పసిఁడిమిటారిగట్టుదిగువం దగునెత్తమునం దఖండమై
పొసఁగు మెఱుంగుఁజప్పరపున్ జిగిరత్నపుమేలుచట్టుపైఁ
బసగలకోనలోఁ దళుకుబంగరరంటులతోఁట కోటలో
ముసరి జవాదిపుప్పుఁవలపుం దగ సూరెలపై బుగుల్కొనన్. ౧౬౪

శా. పూవుందేనియకాల్వచెంత విరిమావుల్వెన్నచాల్కంచెగాఁ
గ్రేవ న్సంపెఁగగోరఁటుల్ బెరయుచక్కిన్మల్లెగుర్వెందపూఁ
దీవల్లుం *బలుద్రాక్షకప్పుగల †పందిళ్లంటులోఁ దమ్మిపూ
బావిం జెల్వగుచల్వచప్పరముగప్రంపుంబలుందిన్నెపై. ౧౬౫

శా. కందర్పుం డిరవొందఁ బాంథవనితాకాం ×తాంగధాతువ్రజం
బందంట న్వడిఁ గ్రుచ్చి త్రిప్పవెస నాయాధాతువుల్గ్రమ్మనం
దందం బొందగు చెందొవల్మోదలుగా నల్లేర్చి పువ్వమ్ములా
రం దాఁ బాన్పు రచించి యుందుపయిఁ దాఁ బ్రాయోపవేశంబుగాన్.

వ. ఒడలిడి యుడుకుచుఁ బడంతుక పొడ గడలుకొన నుండి తనమనంబున.

చ. తనమదిలోన నుంచుకొనఁ దాపము దుర్భర మయ్యె మేనుసన్
ఘనవనవహ్నిఁగ్రోల నగు ‡కాఁకకు నేగతి సైఁచె నొక్కొ య
వ్వనజదళాక్షుఁ డక్కట యబద్ధము దోఁచెఁ §జరాచరాత్మయా
ఘనున కిదేలయబ్బు మయిఁగాఁక మనుం డిడునంచుఁ జింతిలున్. ౧౬౭

ఉ. అక్కట వేగిరంపడుచు నందితి నమ్మనంపసెజ్జలో
నెక్కొనుశౌరి ఖేదపడునేరమి వచ్చె నటంచు లేచుచుం
జిక్కునె యిట్టివేదనకు శ్రీపతి యాశరరాశిమీఁదఁ దా
నెక్కొని సౌఖ్యమొందె నని నెచ్చెలి (వ్రాలెను) సెజ్జ మెల్లనన్. ౧౬౮

గీ. మదనునాఱవయమ్మన మ్రగ్గునెలఁత, యాత్మవైషమ్య ముడిపిన దైన నింతిఁ
బాన్పువై ఖరిచేబాధపఱిచె నమ్ము, లెనయునౌచిత్య మిల నచేతనము లెట్లు.

వ. ఇవ్విధంబున వనంబునం గుసుమశరశయ్య మెలంగు మెలంగ నంతనక్కడ.

---

*బయిఁద్రాక్షు †పందిళ్లంటులో ×తాంగదాధువ్రజ ‡కాఁతరు §జరాచరాంతఃమ్మా.

ఉ. సుందరయాన యిందుముఖిసుందరమందిరసీమ లేమికిం
దందరఁ జెంది సుందరులు తద్విధ మెంతయు నీలవేణికిం
ఖాందుగఁ జెప్పినం జెలులఁ బుల్కనఁ జూచుచు నుల్కి నెమ్మదిం
గొందల మంది హా యెటులఁ గోకకుచామణి యేగెఁ జెల్లఁబో. ౧౭౩

క. అని చెలుల దూఱుచును మది, వనటం గూరుచు లతాంగి వడి నచటచటం
గనుఁగొని చొప్పరయుచుఁ జెలి, ఘనతరశృంగారవనముఁ గనిచొచ్చె వెసన్.

చ. అడుగులజాడఁ జూడ మలయానిలపోతవిధూత మైనపు
ప్పొడి పయి సంతతం బొదవు పూవిరితేనియవానఁ గానఁగా
న్పడమిఁ బువుంబొద ల్చిగురుమావులుతావుల జోకమోక చొ
ప్పడు నిరవు ల్గొలంకుగమిపజ్జలు నన్నియుఁ జూచి యంతటన్. ౧౭౪

ఉ. ముమ్మర మైన మైసెక లపూర్వపుటూర్పు కడిందివెట్టయుం
గ్రమ్మఁగ మిక్కిలిం గమలి కన్నను నిగ్గడ తీవెజొంపముల్
*గ్రుమ్ముడి జాఱుపువ్వులును గుబ్బచనుంగవ వీడురత్నముల్
కొమ్మపదారవిందములు గూడఁగ నోఁచినత్రోవఁ దెల్పఁగన్. ౧౭౫

క. అత్తెరువునఁ జన నొక్కెడఁ, జిత్తభవునియుంపసెజ్జఁ జేరి బలువగల్
కుత్తుకబంటిగ నొంటిగఁ, జిత్తము తత్తఱముఁజెందఁ జింతిలుదానిన్. ౧౭౬

చ. పగలొనరించుజేని సెక ప్రమ్మినతేఁదొగజేని రేకతోఁ
దగవున కేగుదాని సెకచాలుపువేలుపు సోఁక జోకవో
నొగిలినపూలదండ వగ నూల్కొనుదాని నసుస్రుతాంగి మై
జిగి ×విడనాడు కాకవితచిన్నతనంబు వహించు నెచ్చెలిన్. ౧౭౭

సీ. వీనులు ముయ వచ్చి †వె (సవంగు) ఘుఘువీఁకఁ గలకంఠకలకంఠగానతతికి
ముసుఁగు వెట్టఁగఁబూనివెసఁద్రోచుబటియుంటమాధుర్యమాధుర్య మధువిసృతికి
సీత్కరించియు వెడి ‡సీత్కరింపమిఁ జెందుఁ బల్లవపల్లవభల్లహతికి
వడఁకియుమగుడ గొఱుపాఱు మలయాగమలయాగమసమీరచలనకృతికి
నిట్లుదొలుదొల్త భయపడి యెఱఁగియంత, దనుపుదొఱఁగంగఁదలఁచినదానికకట
మారుచెయ్వుల కేలొకో మాఱికొనఁగ, ననుచు వెచ్చగనూర్చు చునడలుదాని

చ. కనుఁగవ విచ్చి చూచు మదిఁ గన్పడుఁ గృష్ణుఁ డటంచుఁ జెంగటం
దనరుతమాలసాలరుచిఘట్టము దార్కొను రిత్త కౌఁగిలిం

---

*గ్రమ్ముడి-మూ- కురుముడి- లక్ష్మీపతిగారి భారతవ్యాఖ్య- క్రొమ్ముడి యనివ్యవహారము.
× వడనాడు † వె..ల్గఘుఘు- ‡ సీత్కరింపఁగ.

చినఁ దనచేతిలోఁబడమిఁ జెన్నటి కన్నుల నీరు *నించి వం
(ది) ననలపాన్పుఁ జేరి విధిఁ దిట్టుచు వెచ్చఁగనూర్పు నెచ్చెలిన్. ౧౭౯

క. ఉసుగనికన్నీర్వాలివం, బసి జాఱెకుళయ్యఁ జూచి పాపపుదైవం
బొడలిచట విడువ × నీయఁడు, చెడఁజూచెనుఁ గటకటాయనీయనుదాసిన్.

ఉ. అత్తమొలంబెలంగెడుమహోవసనంబు కరంబు చేగచే
హత్తి హరింప మున్న మన సాదినవాఁడవు మమ్ముబోటులన్
రిత్తములన్ మెలంగ విహరించుట నీమది కెగ్గ దోఁచునే
దత్తురకాఁడ యంచనఁగఁ దప్పియు నీవొనరించు చున్నఁడో. ౧౮౧

ఉ. పల్లవవృత్తి నీ వధరపల్లవఘాతకు మ్రొగ్గ నేటికో
పల్లవమున్ హసించు జిగివట్టెడి యంచునో తత్సనూసము
న్వల్లభ పంచమిూఘటన వర్తిలఁజేసితో యంచు నే నన
న్నెల్లనఁ బాటి మోవి గొని మేలగు కెంపులు నించు చున్నఁడో. ౧౮౨

చ. కలికిమిటారిగుబ్బచనుగట్టుల ప్రేగున కోర్కెఁజాల వి
చ్చలు క్షణమాత్ర నా యెడఁ బొసంగఁగ నిల్పుదునో సుధారసం
బు లొలుకనీక మోవి పలుమోపున నానుదునో యిఁకేమి కా
వలె నది గూర్తురంచుఁ దమివాఱఁగ నిట్లలరించు చున్నఁడో. ౧౮౩

చ. తలఁపున నిల్చుచు న్మరుతఁ దాలిమి నిల్పఁగలేక కౌఁగిట
న్నిలుపున గ్రుచ్చి మోముపయి నెమ్మొగ మూఁదియు మోవి తేనియ
ల్వలు మొన లాని చెక్కుఁగవఁ బల్మఱు గీటుచు నంతఁ గేలిమై
యలరులపాన్పుపైఁ † బెనఁగియాడుట యెన్నఁడొకో మనోహరా ౧౮౪

చ. మగని ‡ మెఱుంగుఁజేల మిటు మార్చెడఁ గట్టితి వాతఁడు న్రయ
మ్మొగ భవదీయవస్త్రముకు బూని నెఱుంగ రిదేమి వింత యిం
త గలవకే సమాటములు నాతిరో సన్నకుసన్న పోయి పూ
ర్వగతిఁ బొసంగరాదె యని రామ లనంగ మెలంగు చున్నఁడో. ౧౮౫

చ. అని పలవించుదానిఁ దను వారయ నెంతకడింది రోజ ది
ట్లును విడ దార యం చిటునటుం బొరలాడెడుదాని నింక న
న్గనినఖరాత్మ్ము దూఱకొనఁగాఁ బనియేమి దయం దొలంగెఁగా
నెనరుది నీలవేణి యని నెవ్వగవెల్లి మునుంగుపైదలిన్ ౧౮౬

---

*నించవెం......ననల. × నివ్వాను ‡ పెనువవాడుట- మూ. పెనఁగువాడుబాయు నన
వచ్చును. † మెలంగుచేల.

గీ. సకలభూషణలక్షణసంగమంబు, పేరనాడుచుఁ జూడ్కికి వింత యగుచు
లలితవైఖరి గనియున బ్రంబుగాఁగ, సదృశవస్తు నిబంధన సడలు దాని. ౧౮౭

చ. అనయము మారుఁ డేయుపువ్వుటమ్ముల నెమ్ములు గాఁడి వాడి నె
మ్మనమున వంతఁ జింతిలుచు మక్కువఁ జెక్కిటఁ జేయిఁజేర్చి నె
క్కొను (పెను)వేఁదురందు ననుఁగున్నవలారతనంబుఁ జూచి గ్ర
క్కున భయవిహ్వలాత్మ యయి క్రొమ్మెఱుఁగారు మిటారికత్తెలన్. ౧౮౮

ఉ. సందడి చెందకుండ నొకచాటున నుంచియు నీలవేణి తా
ముందుగఁ బోయి కౌఁగిటను ముద్దియఁ *జేర్చి ముఖాంబుజంబుపైఁ
జిందునునుంగురు ల్జతగఁ జేరిచి చెక్కిట నిచ్చలంబుగాఁ
బొందిన మేలు కేల్దిగిచి పొందుగ విందులు సింద నిట్లనున్. ౧౮౯

ఉ. అమ్మకచెల్ల చెల్వ క్షణమైన వయస్యలఁ బాయ వెన్నఁడై
నమ్మజె వారికన్నఁ దమి నాపయి నెక్కుడు గల్గుదాన వీ
విమ్మెయి నొంటి రాఁ దగునె యీకడుగోలవు నీకడిందిచై
దమ్ము లిఁ కేమనందగుఁ బదమ్ములు పుప్పొడి కెట్టు లోర్చునే. ౧౯౦

ఉ. పల్లవసంగతి న్మెలఁగుపంచము లుండెడుచోటు మాటకే
యిల్లడ మైన బేరజము లీఁగెడుమాటు విషాళిపాటు అం
పిల్లెడితావు చూడఁగనె బెట్టు హరించెడిక్రుచ్చు హెచ్చి సొం
పిల్లెమునిక్క యక్క యిది భీతిల కిచ్చటి కేలవచ్చితే. ౧౯౧

క. నగువారి నెఱుఁగవైతివి, తగ వారడిపాలు సేయఁ దలఁచితి వయ్యో
మగువా యింతటి కట్టిడి, తెగు వాను మటంచు నవరు దెలిపిరి తల్లీ! ౧౯౨

క. శయ మానుచుఁ జెక్కిట సం, శయ మానఁ బనేమికుసుమశరువలనన యో
భయమా నవలా నీకు న,భయ మానలినాక్షుఁ డిచ్చుఁ బరమార్థముగన్.

చ. సకియ మరుండు నీదుకనుసన్నలవాఁ డటె యొక్కకుత్తుకై
పికము శుకమ్ము నీపలుకుఁ బేరెమి దాఁటఁగ లేదు నీదు న
డ్డి కనుగుణంబు నంచగమి; కీవి వసంతుఁ డలంతి నీవనీ
పకుఁ డటె సడ్డచేయుచు భవాదృశ కీర్తులు రాఁగ నర్హమే. ౧౯౪

క. మొదట ననంగుఁడు మదనుం, డదనున విరియంగఁ బాఱునట్టివి శరముల్
వదల వవి మృదులవిషమత, మదనువలన భీతి నీకు మది వలదమ్మా. ౧౯౫

---

* దెచ్చి.

ఉ. నీరజరాగదోషముల నీటుఁ దొలంగఁగఁ దాఁ బయోరుహా
భీలవిరంపుఁ గన్నులను నీడనఁగూడక యుండుఁ దొల్తఁ ద
న్నీరజజాతికిం దపము నేఁడు ఫలించెఁ గదే కటాకటా
నీరజరాగము ల్గలిగి నీటును నీకనుదోయి సాటిగన్ ౧౯౭

చ. చెలువరొ పూవుఁదేనె బలుచిత్తడి నైనను మాన కెప్పుడు
న్మలయుము మందుఁ బుష్పశరమారము నేగతి నోర్చె తమ్మ సం
కులమదబాంధవప్రకరకుట్టన నైనఁ దొలంగ కెంతయుం
గలయఁగఁ బన్ను తేనెజడి*కాఱియ మూఱియ దాని సైఁచితే ౧౯౮

సీ. జలమున జీవించుజలజనాళంబులు దినమందగతులు సంధిల్లుచోటు
నతిరక్తిముఖత సంతతసత్ఫలచ్ఛిద నడుకల్లరులు నజ్జాదునిక్క
కనుగొంపుగఁ జొక్కపుటేఁజిగుర్వోలిచి మనుపిసాళులు చెలఁగుచాయ
మలినచ్ఛదముఁ బూని మధుమాత్రవాసన సొక్కుమత్తాళి పెంపెక్కువంక
యాటను మెలఁగంగఁ గటకటేమిటికి వచ్చి
తో ఘనమృణాలభుజకాండ యోసుబింబ
దశనవసన యోకిసలయతరుణచరణ
యోసురభిళాంగి నెమ్మది నోటలేక.

చ. మెలఁతరొ కృష్ణుపై మనసు మెత్తని దెంతకడింది యమ్మెనే
కలితమృదుత్వసంపదల గాదిలి చందురమాను యాదిగాఁ
గలసుకుమారవస్తువులఁ గాదను నిచ్చలువంపుమేను నేఁ
జెల యిటువంటి బల్కటికిచేష్టలఁ బెట్టఁగఁ బట్టె నక్కటా. ౧౯౯

క. గురుశిక్షచే మహాగము, గురుమర్మము గనియె మున్ను గురుకుచ యిపుడుం
బరికింపఁ గనియె మన్మథ, గురుశిక్ష మహాగమంపుగురుమర్మంబుల్ ౨౦౦

గీ. అతిఘనాగమసంబంధ మతివ కమరె
నతిఘనాగమసంబాధ మబలఁ గన్న
యినుఁడు చెందఁడొ చాయయు నెనయ లేదొ
కారణగుణంబు కార్యంబు గనఁగరాదొ. ౨౦౧

గీ. కృష్ణునందు సరాగత గీలుకొన్న
యింతి కపరాగసాంగత్య మెట్లు పొసఁగు

---

* కాఱయు.

నెన్నఁగఁ బరాగ మెపుడు సహించునింతి
కిపుడు దాని సహించుట యెంతయరుదు. ౨౦౨

గీ. విమషి వధ్యర్థితపదార్థవేత్త్రి నీవు, తండ్రిఁ బోలుచు మమ్ము సంతాపపడఁగఁ
జేయ నేటికిఁ దల్లియా ఛాయఁ బోలి, చల్లఁజేయవె మమ్ములఁ జంచలాక్షి.

వ. ఇట్లు పల్కుచు నాలోన. ౨౦౩

ఉ. అక్కట యొందునైన హరిణాక్షులు చక్కనివారిఁ గోరరో
మక్కు వెఱింగి తండ్రి గరిమం బ్రియుఁ గూర్పఁగ వేరమింపరో
చక్కగఁ గూడి యిట్టిపలుజాడలబూమెలు చూచినారమా
యక్కరొ నీకుఁ గల్గె నని యాడెడు చేడెలఁ జూచి వారలన్. ౨౦౪

చ. కనలుచుఁ బల్కి పల్కు కసుగందని ముద్దులగుమ్మ యమ్మనీ
మనమునఁ గోరుకొన్న యలమాధవు నీధవుఁగా ఘటించు నీ
జనకుఁడు *నేఁడొ రేపొ యతిసౌఖ్యము నొందెడు తెల్లవాఱినం
గనుఁగొనువారు మెత్తురు వగల్గొని తెంపున కిట్లు చొత్తురే. ౨౦౫

చ. పొలఁతిరొ యేఁడుచందమునఁ బుట్టినవారికి నెల్లఁ గోరికల్
గలయవె నీకె యన్నటులు గా దిఁక నేమని యంటివేని పైఁ
దొలఁకఁగనీక కూర్మి మదిఁ దొట్టిన గుట్టుగ మట్టు సేయుచు
న్నెలఁగుపొలంతి యెన్నఁదగుమేటి నెలంతలలోనఁ బైదలీ. ౨౦౬

క. కన్నుల నీ రేటికిఁ జెలి, గన్నులచెలి కొన్నినాళ్లు గడవం దగవే
కన్నుల మూఁతం జేకొని, కన్నులవిల్తానిబారి గడచెదు పిదపన్. ౨౦౭

మ. అని సిగ్గెక్కఁగఁ బల్కినం దరుణి యయ్యబ్జాక్షికంఠంబున
న్ననుఁగేల్దమ్ములు గట్టిగాఁ బెనఁచి కన్నుంగోనఁ గ్రొవ్వేఁడినీ
ర్దొనఁక న్వాడినమోము దమ్మి చెలిముద్దుం జన్నుఁబూబంతులం
దను వొత్తిల్లఁగఁ జిక్కఁ జేర్చి ‡రహించిందం బల్కు మందంబుగన్. ౨౦౮

†ఉ. కాఁకలుముంచు మేనుగలకట్టిడితండ్రికిఁ బుట్టునాకు మై
కాఁకలుగాక (సౌఖ్యములు గల్గు) నె యక్కట తప్పనంటేఁగా
కాఁకల కోసమై కొఱఁతగాంచిన నోములు నోఁచునాకు బ
ల్గాఁకలు గాక యాజమున కాంచెనె కాఁకలు తత్తనూజయై. ౨౦౯

ఉ. సానలుపట్ట నోర్చు నినుచక్కని కూఁతురఁ (గాళి యోరగా)
నూనవిషానలచ్ఛటల కోడని §యేటికి ముద్దుఁజెల్లెలన్

*నెడొరేపె ‡రక. మూ †చూ ౧౩౬వ పద్యముపోలిక. §యట్టికి- మూ.

హాసకి మూలమై జగతి నాడిక కోర్చినచేసితోడఁ గా
నేని భరింప నావశమె యిట్టి యయోగదవాగ్నికీలలన్. ౨౧౧

చ. ననుగనినట్టివారలకె నాపయిఁ గూర్మి యొకింతలేక య
వ్వనటఁ దొలంగఁజేయుట యవాస్తవమై యిటు లుండుకోఁగ ని
ప్పని మది మీకుఁ బట్ట దని పొల్పడి చెప్పఁగనేల యిద్ది మీ
కనభిమతంబ యేని రుచి*యబ్బనె గ్రక్కున నీదృశోక్తులన్. ౨౧౨

క. అటువంటితల్లిదండ్రుల, నిటువంటి యనుంగుఁజెలుల నే నందుటఁగా
యిటు లాప దెడసి కోరిక, చిటుకురు మనకుండ నమరి చెలువందితిఁగా.

ఉ. నీలరుచు ల్దొలంకు సురనిమ్నగచెంగట దర్శచంద్రికల్
మేలగుదచ్చినాదముల మెచ్చుగ సప్రజకన్నమూకు లే
వేళ నుతుల్ ఘటింతు రతివేలమదీయమనోవ్యథాభిదా
తాలసతం జనించి యతిలాలితిఁ జెందెడు మీదుకీర్తులన్. ౨౧౩

సీ. కన్నవారికిఁ జెప్పి కరుణ పుట్టఁగఁజేసి తలఁపు చేకూర్పరే తల్లులార
మీరైన హరికి నామేనితాపముఁ దెల్పి యతని నిం దంపరే యమ్మలార
ము న్నిట్టికార్యంబుఁ జెన్నుగా ఘటియించు చెలువల వినరటే మెలఁతలార
భాగ్యవంతుల కిలఁ బ్రాణదానము మించు పుణ్యంబుగలదటే పొలఁతులార
నే వి శేషించి మీదాన నెలఁతలార, మనసు మీదెంతకటికియే మగువలార
యనునయంబునఁ దీరునే వనితలార, తాళఁజాలను మీయాన తరుణులార!

సీ. వెతకింతకైనఁ దాళితి నయో నేఁజెల్ల నేనెంతకటికినే నీలవేణి
యాఁడుఁబుట్టుకఁ జెందినట్టి యింతులకెల్ల నీలాగు లేదటే నీలవేణి
యెటువంటిపని యైన నీడేర్పఁగల వని నెమ్మి నమ్మితి నిన్ను నీలవేణి
కూర్మిచే నుండెడు కొమ్మలలోఁ జాల నెనరుదానవుగదే నీలవేణి
నీదు నెన రెందుఁ బోయెనే నీలవేణి, నేర్పుచేఁ గార్య మీడేర్పు నీలవేణి
యేల యీవట్టిమాటలు నీలవేణి, తాళ హరియాన యిఁక నేను నీలవేణి.

ఉ. చక్కెరవిల్తుఁ డేయుసుమసాయకపంక్తిఁ ద్రపాభిమానముల్
గ్రక్కునఁబోక మున్నె చెలికత్తియ మొత్తము సేయఁ నారడిం
జిక్కఁగఁ †బల్కు లంగడికిఁ జేరకమున్న ప్రియంబుగాఁ బ్రియు
న్నక్కున గారవింపఁ గలయంతకు నోఁచితినంటె నెచ్చెలీ. ౨౧౪

*యబ్బదె †బల్పులంగడికి

సీ. మాధవాధరసుధామాధుర్యమునఁ దేలు వంశంబుజన్మంబు వడయనైతి
హరిభుజాంతరవాసనిరతి నింపార హారమణిస్వరూప మై యమరనైతి
యాదవమౌళిమోహాసితాపాంగకలాపంబు నై యేని యొప్పనైతిఁ
గమలామనోనాయకమనఃప్రియోద్దామమాధవినై యెట్లు మలయనైతి
నకట వీనిలో నేదైననొకటిమైనఁ, బొంగనుప్రియాంగసంగమాభంగసుఖము
తపనసుతనై తిఁ దాపంబుఁ దలఁగనైతిఁ, జెలులుమీ చేతిరట్టుచేసలయనైతి.
క. వలపు పగవారికైన, న్వల దది యెటులన్న నట్టి వలపున మేనుం
దొలఁచెడుఁ బ్రాణము లీగడె, నిలుపుట యేగండమయ్యె నిక్కము చెలువా.
గీ. ఒరులవెత యొరు లెఱుఁగ రొ నుర్వి ననుట
నిజ మనుఁగుఁజెల్వలే రవ్వ నెఱపఁజొచ్చి
రకట మదితాప మిటు మీరు నరసి తెలియఁ
బడదు మోచు(వాఁడెఱుఁ)గుఁ గావటిభరమ్ము. ౨౧౯
చ. పతులను గోరు నెల్లరకుఁ *బాటులివే యయినట్టులైన నీ
సతులు చెలంగి నన్ను నెకసక్కెము లాడుదు రే యిదంత నా
కత యగుఁబోలు నెట్లయినఁ గానిము ప్రాణము లిప్డు మేన ను
న్నతఱిఁ గదా యిఁకెవ్వరు ననంగల యాడిక లబ్జగోచనా. ౨౨౦
గీ. ఔర యప్రస్తుతప్రశంసాన్వితంబు, పల్కునను వ్యాజనిందానిబద్ధసూక్తి
లలితసంగతభావ నేర్పొలయనన్ను, మీరు నవ్వుటయెఱుఁగనేమెలఁతలార
గీ. వనిత యర్థాంతరన్యాస మొనరు నెట్లు, మదికి నిరపేక్షవస్తుసమర్థనమున
మదికి నింపగుఁ గాదె సామాన్యఘటిత, భవ్యవస్తువిశేషసంబంధమమర.
సీ. కలదన్నఁ గలవానిఁ గలిమిచేడియతేనిఁ గరమున సుడివాలు గలుగువానిఁ
గడలినుండెడువానిఁ గరిఁగాచువగవానిఁగరుణసిల్కెడుచూపుగాంచువానిఁ
గలికినవ్వులవానిఁ గౌస్తుభద్యుతివానిఁ గనఁగ నశక్యమౌ కతలవానిఁ
గనకంపురుచు లీనఁగలపచ్చడమువానిఁ గలుగు కాలం బెల్లఁ గలుగువానిఁ
గన్నెప్రేతలవయసులు గొన్నవానిఁ, గన్నయింతయు నవలీలఁ గన్నవానిఁ
గన్నులను†మంచు నెకమించుగన్నవాని, గాంతుగా నోఁచునకాంతకాంతకాంత
చ. అలదమయంతిఁ (బోలె) నను నంచితపుణ్య నొనర్పు మన్నలుం
దలఁపుము మాధవాప్రకృతతాకథనస్ఫుటభాగ్యగా నమో

---

*పాటియిదే †మించు

విలసితయానమాత్రమున విస్మృతి నొందకు మంచకైవడిన్
వెలయుము తత్కృశోపకృతి వేగనొనర్చి క్రియానురూపతన్. ౨౨౪

వ. అని తరణితనయాతరణి యయోగశిఖిశిఖారణి యై పలుక నప్పలుకులు (ములుకులు) వోలె మదికి నులుకు చిలుక నచ్చిలుక(ల)కొలికి యక్కలికికి ధైర్యంబు గుదుర నెనరు గదురం దియ్యందనంబు ముదుర నిట్లనియె. ౨౨౫

సీ. పంచత్వమే కొను బాణము ల్గాంచిన యతనుండు ని న్నేమి యనఁగలండు
*ఘనవైరమున మందగతిఁబూని వెల్లనౌ రాయంచగమి యేమి సేయఁగలదు
మధుసేవనంబున మాట వూను పికాళివలనిభయం బేమి వచ్చు నీకు
మధుపత్వమున భూరిమాలిన్యగుణవృత్తి దేఁటుభృంగములు నీ తెరువు రావు
బహుళపక్షవిరోధి యా పంకజారి, జడత గుణగంధమాత్రంబు వడయుగాలి
వెక్కసపుమాటలాడుచుఁ జిక్కుఁ జిలుక, యంతమాత్రంబునీకేలవంతతల్లి.

గీ. చెట్టు చెట్టున కొకకొన్ని చుట్టుకుండుఁ
జెలమ చెలమకు నొకకొన్ని సేరుచుండు
మదనుసేనలు నీవంటిమానవతుల
ధైర్యకంచుక మగలింపఁ దలఁచునెట్లు. ౨౨౬

మ. వెడతూపుంగమి నూలుపోఁగునను తీవింగట్టుదుం దుంటవిల్
గడికండ ల్పడ గానుగాడి రసముం గావింతు మీనాంకముల్
మడువంటం బడఁద్రోచి గాలములఁ గ్రుచ్చుం జేసి కందర్పునిం
బడఁతీ దుర్బలుఁ జేసి పుచ్చెద భయోత్పాతంబు నీకేటికిన్. ౨౨౭

వ. అని యాఅడిలం బలికిన నప్పలుకులయెడ ననాదరంబు చేసి వెడనవ్వు నవ్వి యవ్విరిఁబోఁడి నీలవేణి కిట్లనియె. ౨౨౮

చ. కలికిరో ప్రోడచేడియవు గాన నెపం బిడి యోట దీరఁగాఁ
బలికితి వింతె నీకు మఱుమాట వచింపఁగఁ జాలఁ గంతుపూ
ములుకుల మున్నె నాయెడలు మోహము దాఁకి తొలంగుఁ బ్రాణముల్
బలువగ నిల్పి అంతవడిఁ బట్టఁగలేనిఁక నిక్క మోచెలీ. ౨౩౦

ఉ. కన్నులు మూసినప్డు పొడకట్టిన (నాథునిఁ) గౌఁగిలీరయం
చున్నదువంగ నొరెగువఁ జూడఁగ†నీ దపు డేడనుండియో

---

*ఘనవైభవమున- †నీభవుడే

పన్నుచు వచ్చు నాదుప్రతిబంధము ప్రీడయు నంతలోనె మే
నున్నుచుం జలించును గనుంగవ విప్పఁగ మాయ (మా) సఖీ. ౨౩౧

మత్తకోకిల. నీవు నాయెడఁ గూర్మి బోటివి నెమ్మి నాపయిఁ గల్గినం
బూవుఁబోఁడిరొ నాదుకోరికఁ బొల్చు నొక్కరహస్యమే
చూవె నీమది నెంత లేదని చూడ కప్పని వేగమే
చేవ దప్పక తీర్చె దేనియుఁ జెప్పెద న్వినుమ తత్క్రియన్. ౨౩౨

వ. అది యే మని యంటివేని. ౨౩౩

శా. సాక్షాన్మాధవగాత్రసంగతికి నోఁచం గావునన్ దీని క
ల్జాత్ముం గస్తురివన్నె జృంభితసువర్ణాంభోజపత్రంబుపై
నక్షీణస్థితి వ్రాసి నన్నును దదీయాంచన్మహాహారస
ద్వక్షోమధ్యమపీఠి రూఢిగ లిఖింపం జూచి యైనం జెలీ. ౨౩౪

క. బిత్తరి చిత్తములోపలి, యుత్తల మొకకొంతయైన నుడిపెద నిటుగాఁ
జిత్తము నిలుపంగదవే, యుత్తమసుకృతంబు నీకు నొనరు నటంచున్. ౨౩౫

చ. పలికి గళన్మరందరసబంధురగంధరసాంధబంభరా
కలితరవంబులం బ్రసవకమ్రవినమ్రరసామ్రతామ్రకో
మలనవపల్లవగ్రసనమంజుకషాయితకంఠ కాకలీ
కలకలకంఠనాదములఁ గల్గి తటంబున నుల్కి యుల్కియున్. ౨౩౬

వ. అప్పు డప్పల్లవపాణి కపటగోపికాపల్లవాయల్లక మెల్లం...దురంతసంతాపంబున నెంతయు నొల్లంబోయిన నీలవేణి తోడి నీలవేణులం గూడి కటకటంబడి చింతించి యీయింతికి సంతాపంబు బలవంతం (బలుతుల) నంతంబుఁ జెంద నేర దీయెడఁ గొంతకొంత శాంతింపం దశిశిరోపచారంబులు పచరింపం దగు నని నఁ దత్సహితలై తత్సహితలు తత్క్రియాయత్తచిత్తలై రయ్యవసరంబున. ౨౩౭

—కాళిందికిఁ జెలులు శిశిరోపచారములు చేయుట—

ఉ. తావుల మోక*మావిగమితావుల గొజ్జగనీరుయంత్రముల్
క్రేవలఁ జిల్కఁగాఁ జిగురు †గేదఁగిపూదడిగట్టి వట్టివేర్
పై వజిలారుచెంగలువపందిరి చెందొవరేకనంటి క్రొ
మ్మోవులచందుపాపగడమొగ్గల నిగ్గులచప్పరంబులోన్ ౨౩౮

*మామిగమి †గేదఁగిపూదడి

సుగంధి. కప్పురంపు-దిప్ప నొప్పఁ గప్పెపైఁడిశమ్మిమే
ల్పుప్పొడి న్రచించినట్టి పుర్వ్వ సెజ్జమీఁదికిన్
అప్పడంతిఁ దెచ్చి, తెచ్చి రంబుజాక్షు లందఱుం
జెప్పరాని వేగ మూని శీతలించు వస్తువుల్. ౨౩౯

ఉ. సారసచందనైణమదసంకుమదాగురుకేసరాళిక
ర్పూరపరాగకుంకుమసముజ్జ్వలపల్లవహల్లకాచ్ఛక
హ్లారతుషారనీరబిసహారసమంజసపుష్పమంజరీ
వారము లాదిగాఁ గొనుచు వచ్చి కరం బరుదారు నేర్పునన్. ౨౪౦

చ. మలయజకర్దమం బొడల మాటి కలంది మృణాలవల్లరీ
వలయచయంబు లంఘ్రులను బాహులఁ గదియించి వేసలి
న్నెలయఁగఁ దెల్లదమ్మి యిడి పెల్లుగఁ గస్తురి కంధరంబునం
గలయఁగఁ బూసి యింతి శిరస్సైవడిఁ జేసి రనంగభీతికిన్. ౨౪౧

చ. మృగమదచర్చ యంతటను మేన నలంది పరాగరాగసౌ
భగకదళీదళంబుఁ గటిపై నిడి చెందొవపువ్వుటెత్తుఁ బొ
ల్పుగ నెదనుంచినప్డు సతి వొల్చె ననారతశౌరిభక్తియో
గగురునిజాంతరంగ యగుఁగానఁ దదాకృతి దాల్చెనో యనన్. ౨౪౨

ఉ. అంగజుఁ డంగనాఘనహృదంతరకర్పరసీమ స్నేహము
బ్బంగి నభంగురం బగుచు భాసిలఁగా దశపై దశాంతరం
బుం గదియించి త్రోవఁ బరిపూర్ణతఁగాంచి యయోగదీప మే
చం గడు స్రుక్కుచుం గిసలసంఘటితవ్యజనానిలంబునన్. ౨౪౩

సీ. పదములఁ జెంగురాకు లొదవించి జంఘల స్మరతూణతిలకము ల్మురువుకొల్పి
తొడల నరంటిదవ్వ లదరించి సొబగారుకటిపైఁ బరాగసైకతము నించి
నడుమఁ బుష్కరభంగి దొడరించి యారున జొంకగాఁ గస్తూరిరేక దీర్చి
చన్నుల గుచ్ఛము ల్సవరించి నెమ్మేనఁ జందనం బలఁది భుజంబుల బిస
కాండమిడిచెక్కులనుజంద్రఖండములఁ దిడి, వేణిశైవాలమునఁ గూర్చి వెలఁది యంగ
సామ్యసదసత్పరీక్షావిచారణ బలెఁ, జెల్వ లీరీతిఁ జేసిరి శిశిరవిధులు.

చ. ఎడపక యింతు లెల్లఁ గదియించినపల్లవసూనగుచ్ఛముల్
తొడరి వియోగవహ్నిసెక దొట్టఁగ *జివ్వన నీరుదీసి యె

* జత్వ

